# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుఁడు

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౨౦]    ఆగస్టు 1951    [సంచిక ౮




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపుచందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువకేరకు తపాలాబిళ్లలు పంపవలయును వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండు ప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# విషయ సూచిక


ప్రధాన వ్యాసము : స్వాతంత్ర్యదినం 431
దేశమా - భర్తయా : శ్రీమతి వీరంరాజు వెంకట రమణాదేవిగారు 433
స్త్రీ ఔదార్యము : శ్రీ డి. రాజేశ్వరి గారు 437
చందమామ : కె. వి. గారు 438
మాతృహృదయము : శ్రీమతి పి. శేషమాంబగారు 439
మామిడి : వాశిరెడ్డి సుశీలాదేవిగారు 443
గృహిణి - సంస్కృతి : శ్రీమతి సూర్యదేవర సులోచనాదేవిగారు 445
ఆదర్శమిధునం : శ్రీ చీమలపాటి సూర్యనారాయణరావుగారు 447
జట్కావాడు : కొల్లిపర సౌభాగ్యరావుగారు 449
రూపాయి ఆత్మకథ : శ్రీమతి ఇంకొల్లు రంగనాయకమ్మగారు 454
మహిళాభ్యుదయము 456
మచిలీపట్నము మహిళాసేవామండలి (ఫోటో) 457
జాతర : గౌరవరం వెం. రమణగారు 458
పాకకళ 460
బ్రతుకు తెరువు : చివుకుల లక్ష్మీకాంతమ్మగారు 461
చిత్రాంగి : శ్రీ ఎ. వి ఇ యల్. సత్యనారాయణ రావుగారు 463
వరకట్నము : చదలవాడ నాగరత్నముగారు 467
సౌభాగ్యవతి కమల : శ్రీమతి ఉప్పులూరి వెంకట సత్యవతిగారు 468
ఆవుబుల్లాయి : శ్రీ బి. యస్. రాజారెడ్డిగారు 470
గృహవైద్యము : మ॥ వె॥ రమణమ్మగారు 471
కీ॥ శే॥ శ్రీమతి అచంట రుక్మిణిలక్ష్మీపతిగారు 472
సినిమారంగము 473
శ్రీ దశావతార స్తోత్రము : దోమా ఇందిరాదేవిగారు 474
ఉత్తర మద్రాసులోని తెలుగు విద్యార్థినుల కడగండ్లు : వి. పాండురంగరావుగారు 476
లోకవార్తలు 477
కథలు కబుర్లు 479
పుష్పచయము 481
స్వీకారము 482
సంపాదకీయములు 485
పంచాంగం 486




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# స్వాతంత్ర్యదినం

ఈ రోజు స్వాతంత్ర్యదినం. కాని ప్రజలు ఉత్సాహవంతంగా ఉత్సవములలోను, వేడుకలలోను పాల్గొనే వాతావరణములేదు. అందుకు దేశములోని అయోమయ పరిస్థితులే కారణం. అయినా స్వాతంత్ర్య దినోత్సవము జరుపుతునేయున్నాము. అంటే నగరాలను పల్లెలను అలంకరించడంతో కాని, ఉత్సవాలను, ఊరేగింపులను జరుపుటతో కాని, నూతన వస్త్రధారణంతోగాని తృప్తిపడితే చాలదు. స్వాతంత్ర్యము సిద్ధించిన తరువాత తమపైపడిన బాధ్యతలను గుర్తించి పూర్వాపరాలను నిర్మల హృదయంతో, విశాలదృష్టితో ఏమాత్రం అవగాహనంచేసికొన్నారో సమీక్షించుకోవలసియున్నది.

స్వాతంత్ర్య సమరంలో అనేకమంది అతిరథమహారథులు తమ ప్రాణాలను అర్పించారు. అనేకమంది మహోన్నతములయిన త్యాగములుచేశారు. వారుచేసిన త్యాగాలకు, పడినశ్రమకు ఫలితంగానే యీనాటి స్వాతంత్ర్యము మనకు సిద్ధించింది. వారిని,

వారి అచంచల దీక్షను, విశాల హృదయాలను, ఆదర్శంగా నుంచుకొని కృతజ్ఞతా పూర్వకంగా దేశాభివృద్ధికి కృషిచేయడానికి ప్రతిజ్ఞ చేయాల్సిన రోజుయిది.

స్వాతంత్ర్యసిద్ధికి పూర్వంవున్న నిజాయితి, స్వార్థరహితమయిన దేశసేవా పరాయణత, విశాల దృక్పథం, నీతినియమాలు తమలో నున్నవేమో యీనాడు ప్రజలు పారచూడాలి. తమలోనున్న లోపాలను సవరించుకొని ఆత్మవంచనలేకుండా దేశంలోని వివిధ విషమ సమస్యలను పరిష్కరించడానికి సహకరించి పూనుకోవాల్సిన రోజుయిది.

ఆకలిమంటలు, అశాంతి నలుదేసల వ్యాపించియున్న యీ సమయంలో చిత్తస్థైర్యాలతో వ్యవహరించి యీ ఆపదనుండి విముక్తి నొందుటకు ప్రతియొక్కరును మార్గాన్వేషణముచేయ సంకల్పించుకొనవలసిన సమయమిది.

బాధ్యతలను గుర్తించకుండా హక్కులను గురించి మాట్లాడాల్సిన సమయం కాదిది. అవి రెండును ఒకదానినొకటి ఎల్లప్పుడు అనుసరించుకొని యుంటవను విషయమును గుర్తించి దేశాన్ని శాంతి అభ్యుదయాలవైపుకు నడిపించుటకు కంకణము కట్టుకోవలసిన రోజుయిదియని పురుషులు, స్త్రీలుకూడ గుర్తించెదరుగాక.

---o---



# దేశమా — భర్తయా

శ్రీమతి వీరంరాజు వెంకటరమణాదేవి

చంద్రకాంత సన్నిభమైన దివ్యమందిరంపై కూర్చుని, అస్తమిస్తున్న సూర్యుణ్ణి చూస్తూ ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నది కృష్ణపురాధీశుని కుమరిత 'రమాదేవి.' ప్రియుడు తనను వదలివెళ్ళి రెండు సంవత్సరములు గడచినవి. తన ఒంటరి ఎడారి జీవితానికి ఎప్పుడు వసంతం చేకూరుస్తాడో, తన జీవితం ఎప్పుడు నిత్యకల్యాణం పచ్చతోరణ మవుతుందో అని ఎదురుచూస్తున్నది రమ. వాలుగాలికి తెరచాపలెత్తి సాగిపోయే నౌకలాగా తమ క్రొత్త కాపురం ఎప్పుడు ప్రారంభమవుతుందా అని నిట్టూర్పులు విడుస్తున్నది. తన రాచనగరుకు వచ్చేమార్గాలన్నిటిని రోజూరోజూ చూసిచూసి ఆమె కళ్ళు కాయలు కాచిపోయినవి. ఈ రోజు కూడా వ్యర్థమయినట్లేనా అనుకొని లేచి ఇంట్లోకి వెళ్ళుదామనుకుంటున్నది.

ఇంతలో అల్లంత దూరంలో ఎర్రని దుమ్ము లేచింది. అటువైపు నిదానించి చూచింది కొనఆశతో రమ. గుర్రపు గిట్టల చప్పుడు వినపడ్డది. చూడగా చూడగా ఎవరో యోధుడు శరవేగంతో వస్తున్నట్లు గుర్తించింది. ఆ యువ్వనుడు సమీపిస్తున్నట్లల్ల రమాదేవికి ఆతుర్దా ఎక్కువయింది. తన ఇంటిముందు గుర్రం ఆగగనే, వచ్చింది తన ప్రేమ పెన్నిధియని గ్రహించింది. సంతోషం కట్టలు తెగింది. తన కళ్ళను తనే నమ్మలేక పోయింది. కళ్ళు నులుముకొని తన ఆకర్ణాంత నేత్రాలను పెద్దవిచేసి మళ్ళా చూసింది. అతడు తన ప్రియుడే. మహాసాగర కెరటంలాగా ఒక్క గంతులో 'బావా' అని కౌగలించుకొంది. రమ ఆనంద బాష్పాలు నదీ ప్రవాహములయి ప్రేమ సముద్రంలో కలుసుకున్నవి. ఎంతకాలం ఆ పవిత్రప్రేమ కౌగిలింతలో తన్మయత్వం చెందారో వారికే తెలియదు. పరవశత్వపు సౌఖ్య తీరిన తరువాత సిగ్గుపడి ఇంట్లోకి గంతువేసింది బావతో.

"అమ్మా ... అమ్మా ... బావ వచ్చాడే" అని కేకలు పెడుతూ తూనిటీగలాంటి యవ్వనం తొణికిసలాడుతూ రమ చెంగుచెంగున లేడివలె గంతులుపెట్టుతూ, వంకలు తిరిగిన త్రాచువలెనున్న జడను వయ్యారంగా త్రిప్పుకుంటూ తల్లి ఒడిలో వాలింది.

"అమ్మా ... లేవే... బావ ఒక్కడే కూర్చున్నాడే" అంటూ రమ తల్లిని బరబర యీడ్చుకొచ్చింది.

"అయ్యో! రమా ... ఎంత పిచ్చిదానివే. బావను అక్కడ కూర్చోపెట్టేవేమే ... ఇంట్లోకి తీసుకొనిరాలేదేం" అని మందలించింది తల్లి.

"లేదమ్మా ... బావ ఇప్పుడు చిత్తూరు యువరాజు. అందుకనే బావను అతిధి మందిరంలోవుంచి నిన్ను తీసుకొచ్చాను ... తప్పేంటే" అని సమర్థించుకుంటూ పకపక నవ్వింది.

"లే ... నాయనా లే ... ఎంతకాలానికయ్యా నీ దర్శనాలు ... ఇంట్లోకి రా ... కాళ్ళుచేతులు కడుక్కోటానికి నీళ్ళు తీసుకురావే రమా... !" అని అతనిని ఇంట్లోకి తీసికెళ్ళింది కృష్ణపురాధీశుని భార్య ముక్తాబాయి.

కాళ్ళుచేతులు శుభ్రంచేసుకొని కూర్చున్నాడు. రమాదేవి చిత్ర చిత్ర పలహారములతో పండ్లతో నున్న పళ్ళెరాలను తెచ్చి బావముందు పెట్టింది.

"అత్తా! మామఏడి" అని పలహారంచేస్తూ తలెత్తి అడిగాడు.

"ప్రొద్దుననే కమల్‌మియర్ వెళ్ళారు." వచ్చేవేళయింది.

"అంతా క్షేమమేనా"

"నాయనా! మహారాణా తమ్ముడివి. చిత్తూర్ యువరాజువి. నీకు మేము యిప్పటికైన జ్ఞాపకం వచ్చాము. అంతేచాలు. రమతప్ప అంతా కులాసాగానే వున్నాము."

"రమకేంటమ్మా"

"దానికి బావజ్వరం వస్తున్నది. ఏదో నీ ధర్మాన ఇంత ... మందిచ్చావా" అని గూఢంగా అన్నది.

"అదయితే అప్పుడే యివ్వడం అయిపోయిందిలే" అని కొంటెగా సమాధానం యిచ్చాడు.

"అరరె ... అప్పుడే మందు తీసుకున్నదన్నమాట. ఇద్దరు తోడు దొంగలే ... మధ్య నేనే పిచ్చిదాన్నయినాను"

"అమ్మా ... ఏంటీ యీ వేళాకోళాలు ... " బావవైపుచూచి, "బావా, రెండు సంవత్సరాల నుంచి ఒక్కమారైన రాలేదేం. అంత తీరనిపని ఏముందయ్యా" అన్నది తీక్ష్ణంగా.

"రమా! నీకేం తెలుస్తుందిలే ఇప్పుడు. యువరాణివైనప్పుడుగాని యువరాజు బాధ్యతలేంటో తెలియవు. ఇదివరకులాగా స్వేచ్ఛవుందనుకున్నావా? నేను యువరాజునేగాక సేనాధిపతినికూడా. మన దుర్గాన్ని ముట్టడించి, మన స్వాతంత్ర్యాన్ని హరించవలెనని సమయంకోసం కాచుకు కూచున్నాడు మొగలు జంబుకం. రాజపుత్రద్రోహి మాన్‌సింగ్ చిత్తూర్‌ను స్వాధీనంచేసుకొని తానే రాజవవలెనని పాదుషా నాశ్రయించి సమయానికై నిరీక్షిస్తున్నాడు. అందువల్ల నిరంతరంగా రక్షణ సన్నాహాలలో నిమగ్నుడ కావలసి వచ్చింది. మనం పోరాటానికి తయారుగా నున్నామని గ్రహించి అగ్బరు యుద్ధసన్నాహాలను ఆపివేశాడు. అందువల్లనే ... అన్నగారి అనుజ్ఞతీసుకొని మాసును చూచిపోదామని వచ్చాను."

"అవును బావా! నాన్నగారెప్పటికప్పుడు చిత్తూర్ విషయాలు చెప్తునే వున్నారు. దేశరక్షణ ముందవశ్యకర్తవ్యంగదా!" అని మహారాణా ప్రతాప్ మరదలు కాగలుగుటకు తనకు అర్హత వున్నదని నిరూపించుకున్నది రమాదేవి.

౨

చీకటిపడగానే స్నానాదికములను పూర్తిచేసుకొని భోజనానికి తయారయ్యాడు శక్తిసింహుడు. ఇంతలో మామ కృష్ణసింహుడుకూడా వచ్చాడు. మామకెదురెళ్ళాడు శక్తిసింహుడు.

"అరరె ... శక్తీ ... ఎప్పుడొచ్చావురా ... ఏంటి విశేషాలు" అని ప్రయాణబడలిక తీర్చుకోటానికి సోఫాపై కూర్చున్నాడు కృష్ణసింహుడు.

"ఒక గంటయిందివచ్చి"

"అంతా క్షేమమేనా"

"ఆ ... ఆ ... మహారాణాప్రతాప్ అండన వున్నవారికి క్షేమానికేంకొదవ." అన్నాడు శక్తిసింహుడు భ్రాతృభక్తి పూరితుడై.

"అయితే అక్బరు యుద్ధసన్నాహాలను చాలించాడటగా ... ఆc. అందుకే ఒకమారు చూచిపోదామని వచ్చావు ఏం ... " అని నవ్వుతూ రమవైపు చూచాడు.

అత్తగారు వెంటనే అందుకొని "మిమ్మల్ని నన్ను చూడటానికి వచ్చాడటండీ శక్తీ" అన్నది హేళనగా రమవైపుచూచి నవ్వుతూ.

"ఇక లేవండి నాన్నగారూ ... భోజనాల వేళయినది. భోంచేసి తరువాత చాలాసేపు మాట్లాడుకోవచ్చు."

అంతా భోజనాలకు లేచారు. భోజనాలు పూర్తిచేసుకొని తాంబూలం సేవించటానికి మేడపైకి వెళ్ళారు.

అంతా తివాసీలపై ఆసీనులయ్యారు. తండ్రికి బావకు తమలపాకుల ఈనెలుతీసి సున్నంరాసి మడతలుపెట్టి యిస్తున్నది రమ. బావకు తమలపాకుమడత అందిచ్చే వంకతో ఆతనిచేతినితాకి మహానంద సముద్రంలో తేలుతున్నది. శక్తిసింహుడు వెన్నెల కాంతులలో మెరిసిపోతున్న రమ సౌందర్యాన్ని తన విశాల నేత్రాలతో త్రాగివేస్తున్నాడు. పాలుతాగే పిల్లికూనలులాగా ఎవరు తమను పరికించటంలేదుగదా అని అనుకుంటున్నారు. వారిద్దరు ఒంటరిగానే వున్నామనుకున్నారు. ప్రక్కన తల్లిదండ్రులున్నారనే విషయం మరచిపోయింది రమ. అత్త మామలు వారి ఆనందాన్నిచూచి ఎంతో ముచ్చట పడ్డారు ఎవరి మనస్సులలోవారు.

"ఒరే శక్తీ" అని పిల్చేటప్పటికి త్రుళ్ళిపడ్డాడు శక్తి. ఆ లోకంనుంచి యీ లోకంలోకి వచ్చాడు. రమ కళ్ళు నలుపుకొని దిగ్భ్రాంతయై చూచింది తల్లిని. "పెండ్లెప్పుడు చెయ్యమంటావు. మా రమ ఇక ఒంటరి జీవితాన్ని గడుపలేదు" అని కొంటెగా అన్నాడు భార్యవైపుచూస్తూ తన చిన్ననాటి యవ్వన సౌఖ్యాలను ఆమెకు గుర్తుచేస్తూ. అంతా సముద్రఘోషను మించేటట్లు నవ్వారు. రమకు లేతసిగ్గు ఆవరించింది. రోమాంచమయింది. శరీరం గగుర్పొడిచింది. తలవంచుకొన్నది. కొంచం సేపటికి తల్లివడిలో వాలింది.

తండ్రి మళ్ళా అందుకొని, "అమ్మాయీ! ఎందుకే అంత సిగ్గు ... ఎప్పుడులేని బిడియం తెచ్చుకుంటున్నావేం ... ఉన్నదున్నట్లు చెప్పాను. అవునా శక్తీ ... ఏమంటావు నీవేచెప్పు."

"రాజు దలచుకుంటే దెబ్బలకేంకొదవ ... మీ యిష్టం మాభాగ్యం" అని సమాధానం యిచ్చాడు రమవైపు రెండు చేతులు చాచుతూ, సందుదొరికిందిగదా అని అవకాశంతీసుకొని.

"నాయనా! ఏదో పెంచి పెద్దవారిని చేశాము మిమ్మల్నిద్దర్ని. నీ వొకటి, మా రమ వొకటా? ఆ కాస్త మూడుముళ్ళువేసి మా నోములపంట పండించు" అన్నాడు మామ ఆనంద బాష్పాలను రాలుస్తూ.

## 3

శక్తిసింహుడు మామగారింట్లో నాల్గురోజులే వున్నాడు. నాల్గవరోజు సాయంత్రం రమాశక్తులు చక్కగా ముస్తాబై చేతులు చేతులు పట్టుకొని తమ విశాలభవన ఆవరణలోనున్న రాజహంసలీడే సరోవరమ్మునకు వెళ్ళి అచ్చట గట్టుపైన కూర్చున్నారు. చంద్రోదయమయింది. శశి తన శీతల కిరణాలచే ఆ నూత్న యవ్వనులను చక్కిలిగింతలు పెట్టుచున్నాడు. శక్తి తొడమీద తలవాల్చి రమాదేవి తామరతూళ్లతో అతని చెంపపై కొడుతూ.

"బావా! రేపే వెళ్తావా. అప్పుడే ఏంతొందరయ్యా, ఎప్పుడు చెప్పాల్లో ప్రయాణం పెట్టుకొని వస్తావు. ఈ రెండు సంవత్సరాలు నీ కోసం ఎదురు చూచిచూచి నా కళ్ళు కాయలు కాసినవి. పట్టుమని పదిరోజులైన వుండకపోతే ఎట్లా! మళ్ళా వెళ్ళితే, తిరిగి రాక ఎప్పుడో" అని చెమ్మగిలిన కళ్ళతో అతని చెక్కిళ్ళను తాకింది.

"రమా! ఏం చెయ్యను? దేశపరిస్థితి క్లిష్టంగానుంది కాబట్టి రాలేకపొయ్యానుగాని నీ మీద కోపమా నాకు! ఉగ్గుబాలతో దేశభక్తి అలవడిన నీవే ఇట్లంటే ..." అని తల నిమురుతూ అన్నాడు.

"అదికాదు బావా ... దేశాన్ని గాలికి వదలివేసి నిన్ను నాముందు కాళ్ళుబారజాపుకొని కూర్చొనమని చెప్పానా నేను. నేను నీ అర్ధాంగినై ఎప్పుడు 'కార్యేచమంత్రి' నవుతానా అనేదే నా ఆదుర్దా. ఊడగొట్టిన నాగలిలాగా నీవొక్కడవు ఎంతకాలం యీ కార్యభారాన్ని వహిస్తావు? దేశరక్షణలో నాకేం అవకాశమివ్వవా" అని తన కళ్ళను ప్రకాశింపజేసింది.

"నీవే మంటావనేగాని పులికడుపున మేక పుడుతుందా" అని ఉబకవేశాడు శక్తి రమను.

"బావా నాకొక కోర్కెవుంది. అది నీవు చెల్లిస్తావంటే చెప్పుతా. అగ్బరు ఎప్పుడైతే చిత్తూర్‌ను ముట్టడిస్తాడో ఆ రోజునే మనం వివాహం చేసుకుందాము. ఆ మంగళ వస్త్రాలతోనే శస్త్రధారులమై మన సైన్యాలను శత్రువులపై వురికిద్దాము. అగ్బరుకు హైందవ వీరనారి శక్తిని చూపెట్టవలెనని వున్నది. అతనిని ముప్పతిప్పలుపెట్టి మూడుచెర్వులనీళ్ళు తాగిద్దాము. హైందవ సామ్రాజ్య స్థాపనకు మహారాణాకు అండగా నిలబడదాము. గెల్చామా రాజ్య సౌఖ్యాలు, ఓడేమా అమరమరణం, తదుపరి స్వర్గ సౌఖ్యము. చిత్తూర్ యువరాజు యువరాణు లిద్దరు ప్రేమాగ్ని కౌగిలిలో దగ్ధమయి అమరజీవులవుతారు. ఇది నీ కంగీకారమేనా శక్తీ!" అని శక్తిసింహుని భుజాలు పట్టుకొని సమాధానంకోసం **ఎదురు** చూచింది.

"రమా! నీలాంటి స్త్రీని భార్యగా స్వీకరించటం **నాపూర్వజన్మ** పుణ్యం. నేనెంతో అదృష్టవంతుడ్ని రమా!" అంటూ ఆమెను తన కౌగిలిలోకి చేర్చుకొని పరవశత్వంలో కళ్ళు మూసుకున్నాడు.

రమ పరిష్వంగ సౌఖ్యంలోంచి తెప్పరిల్లుకొని, "బావా ... ఆలస్యమవుతున్నది ... అమ్మానాన్న మనకోసం ఎదురు చూస్తుంటారు" అని రమ ముందేలేచి తనచెయ్యి అందించి శక్తిని లేవదీసింది. అతడు లేవగనే ఒక్కచంగున అతని మెడకు తన చేతులను పెనవేసింది. అతడు ఆమె నడుము పట్టుకొని, ఆమె అతని భుజాల నాధారంచేసుకొని చిలకాగోరంకులలాగా ఆనందసాగరంలో తేలిపోతూ ఇల్లుచేరుకున్నారు.

**(సశేషము)**

# స్త్రీ ఔదార్యము



శ్రీ డి. రాజేశ్వర్ గారు

ఒక గ్రామములో ఆత్మగౌరవముగల బ్రాహ్మణుడు కలడు. నిజాయితీకి కట్టుబడ్డ మనిషి. వానికొక భార్యగలదు. ఔదార్యము, నమ్రత, వినయములలో మొదటి స్థానమామెదే. వారిరువురు చిలుకా గోరింకలవలె చాల సుఖముగా కాలము గడుపుచుండిరి. అనుకూల దాంపత్యములో మొదట వారినే పేర్కొనవలెను. కాని భర్త న్యాయమునకు బద్ధుడై, ఏమాత్రమన్యాయము జరిగినను సహించక వెంటనే అన్యాయ పక్షమును శిక్షించవలెననెడి స్వభావము కలవాడు. విద్యార్హతలలో అంత గొప్పవాడు కానప్పటికి, కుటుంబ వ్యవహారములను చక్కబెట్టుకొనుటకు కొద్దిపాటి చదువు గలదు.

అతనికి కొద్దిపొలమే జీవనాధారము. దానిని రైతులచే దున్నించి, కావలసిన ఎరువులు పెట్టి, సంవత్సరాంతమున గింజలను బళ్లకెక్కించి ఇంటికి తీసుకొని వచ్చుట పరిపాటి. రైతులు అనునిత్యము భూమిని గమనించి జాగ్రత్తగా పాటుపడుచుందురు. కాని రైతులలో ఒక నీచుడున్నాడు. ఒకనాడు వాడు వెన్నెలరాత్రుల అర్ధరాత్రి సమయమున వీరి పెరటిలోనున్న చింతచెట్టునెక్కి చింతకాయలు తెంపుచుండెను. చేసి, చేసి, దొంగతనము చింతకాయలే చేయాలి! దానితో కడుపు నిండునా? కుబేరుడౌనా? వాడి తుచ్ఛగుణము చూపించుకున్నాడు. అంతే! ఆసమయముననే రైలు కొఱకు పొలమునకు వెళ్ళుచున్న పంతులు వానినిచూచి "ఎవడురా నీవు? దిగు:" అని అరచెను. వాడు గజ గజ వణుకుచు చెట్టు దిగెను. తక్షణమే వానిని పోల్చి "ఓరీ దౌర్భాగ్యుడా! నీవేనురా? ఎందుకెక్కావ్ చెట్టు?" "లేదు బాబు. అమ్మగారు రేపటికి చింతకాయలు లేవురా, కోయరా పోలిగా అని అన్నారండి. అందుచేత కోస్తున్నాను" అన్నాడు. "అయితే పద - అమ్మగారి దగ్గరకు" అని వాడిపిలక పట్టుకొని తన యింటిలోనికి తీసుకొనివచ్చి భార్యను గద్దించి యడిగెను. ఆమె కొంచె మాలోచించి ఇప్పుడు నేను కోయమనలేదని జవాబిచ్చిన యెడల వాడి ప్రాణములు దక్కవని తలచి "ఆఁ... నిజమేనండి. రేపటికి పులుసులోకి లేవని కోయమన్నాను." అన్నది. అప్పుడు పంతులు వానిని విడిచిపెట్టి పొలమునకు పోయెను. వాని భార్యగాని అట్లు చెప్పనిచో వాడిని చావగొట్టి విడిచిపెట్టెడివాడు. పంతులుగారు పోయినవెంటనే ఆ రైతు అమ్మ కాళ్ళు పట్టుకొని "అమ్మా! నాప్రాణము కాపాడినారు. మీమీద భారముపెట్టి వచ్చాను. మీమేలు యెన్నటికిని మఱువలేను." అని చెప్పి ఆ మరుచటి దినమునుంచి ఆమె యేమి

చెప్పినయెడల ఆవని చేయుచు ఆమె అభిమానమునకు పాత్రుడయ్యెను. చూచితిరా! ఆ స్త్రీ ఔదార్యము.

ఇది 19 వ శతాబ్దములో నిజముగా జరిగిన సంగతి. నేడు అనగా 20 వ శతాబ్దములోకూడ మన స్వతంత్ర భారతదేశము (Free India) లో అట్టి స్త్రీలున్నారు. కాని చాల తక్కువ. ఎందుచేతననగా మన పురాతన హిందూ ధర్మశాస్త్రాదులను విస్మరించి, పాశ్చాత్య నాగరికతా వ్యామోహాగ్నిలో కూలబడిన శలభములైరి. అట్లుగాక హైందవ ధర్మప్రకారము స్త్రీలు ప్రవర్తించి భర్తయనురాగము సంపాదించి, ఆదర్శగృహిణి యనిపించుకొనుటకు ప్రయత్నించవలెను. ప్రయత్నమునకు ఫలము లభించకపోదు. భూమి (Earth) అక్షము అనే ఒక ఇరుసునెట్లు ఆధారము చేసుకొని భ్రమణము చేయుచున్నదో, అట్లే గృహమందలి బాగోగులు గృహలక్ష్మిపై ఆధారపడియున్నవి.

—o—

## చందమామ



స్వర్ణపీతాంబరద్యుతి సొరుమీర
నిర్మలాకాశ సౌధాన నిక్కినిక్కి
తరులతా పుష్ప గుచ్ఛ సత్కాన్కతోడ
వేచియుండిన ప్రకృతి చేజాచిబిలువ
చలము దేటికి జేసెదో చందమామ.
పాయసము బెట్ట బిలిచెడి పాప జూచి
దాగుమూతల కోరెడి తరులజూచి
పర్వులిడ వేగరమ్మను బాలుజూచి
జాగు చేసెద వేటికో చందమామ.
కలువకాంతలు నీకయి కలువరింప
కామినీ మణులెల్లరు కలువరింప
విచ్చిపీగిన కొంతైన వెలుపు గలుగు
తొంగిచూచిన దొంగని దోసమిడరె.

కా. వి.

—o—

# మాతృహృదయము

శ్రీమతి పి. శేషమాంబగారు

వకీలు కేశవదాసుగారి భార్య శ్యామలాదేవి. రాత్రి 12 గంటలవేళ నిద్ర మేల్కొని తన గదిలో కుక్క పిల్లలని ముద్దులాడుతున్నది. కేశవదాసుగారికి నిద్ర మెలకువవచ్చి చూస్తే పక్కమంచము ఖాళీగా నున్నది. యింత రాత్రివేళ ఎక్కడి కెళుతుందాయని ఆలోచిస్తున్న సమయములో ప్రక్కగదిలో యేవో అస్పష్టముగా మాటలు వినబడినవి. ఈవిడగారే అయివుంటుందని లేచివెళ్లి గదిలోనికి ఒక అడుగువేసి వంగిచూస్తే తన భార్యే కుక్కపిల్లలని వడిలో పెట్టుకొని బుజ్జగిస్తున్నది. ఆ తమాషాచూచి పెద్దగా నవ్వాడాయన. తెల్లబోయి చూచింది శ్యామలాదేవి. నవ్వుతూనే "ఏం శ్యామలా! నిద్రపట్టలేదా, యీ అర్ధరాత్రి వేళ కుక్కపిల్లలని ముద్దులాడుతున్నావు. భలేసమయము దొరికిందిలే. సిగ్గులేదూ నీకు, యింత పెద్దదానవై కుక్క పిల్లలతోనా ఆడుకొనేది" అని మెత్తమెత్తగా నాలుగు చీవాట్లుపెట్టి ద్వారములో నిలబడి భార్యావైపు అదేదృష్టిగా చూడ మొదలుపెట్టాడు. శ్యామలాదేవి పెనిమిటి మందలింపులకు కొంచెము చిన్నపుచ్చుకొని, ఆయనవైపుకి జాలిగాచూచి, "వీటికి తల్లిలేదండి, పాపము చలికి కుంయ్, కుంయ్‌మని వూరికే అరుస్తుంటేను మీకు నిద్రాభంగ మౌతుందేమోనని సముదాయిస్తున్నా"నన్నది.

ఈ మాటలు చెపుతుంటే ఆమెకు కళ్లనీళ్లు గిర్రున తిరిగినవి. ఆ సందర్భము భర్తగారు కనిపెట్టకుండా ముఖం ప్రక్కకు త్రిప్పుకొని వూరుకున్నది. "మనదేవుడి మహిమ మనమెరుగనిదా యన్నట్లు తల్లిలేని పిల్లలంతా నీకే దొరుకుతారులే" అని ఒకసారి జాలిగలుగచూచి నీయిష్టమని వెళ్లిపోయాడు వకీలుగారు తనగదిలోకి.

కేశవదాసుగారి తల్లి పూర్వకాలపు మనిషి. పైగా గంగా భాగీరథీ సమానురాలు. తన యేకపుత్రునకు సంతానము లేదనే కొరత యెంతగావున్నా కోడలియొక్క యీ వింతచేష్టలామెకు యెంతమాత్రము సరిపడలేదు. ఆ రోజు ఉదయమున శ్యామల దాసీదానిపిల్లవాడికి పాలుపోయడము కళ్ళారా చూచిందా ముసలావిడ. చూచీచూడ గానే ఆమెకు పట్టరాని కోపమొచ్చినది. రంకెలువెయ్య మొదలుపెట్టినది. "పిల్లా! నీవీరోజునుంచీ పూజామందిరములోకీ, వంటగదిలోకీ అడుగుపెట్టావంటే వూరుకొనేది లేదు" అని గట్టిగా శాసించినది. "ఊరుకొంటున్నకొద్దీ మీరిపోతున్నావు. కుక్కపిల్లలని ఒళ్ళో పెట్టుకొని కూర్చుంటే చూచీచూడనట్లు పోతుంటిని. ఇదే అలుచని యీ రోజున చండాలపు కుంకనెవడినో తెచ్చి పాలుపోసి పెంచుతావా? పెద్దదాన్ని నేనున్నానని కాస్త వెరవవద్దా? బ్రాహ్మణింట్లోపుట్టి మాలాళ్ల పిల్లాణ్ని పెంచడానికి

నీకు బుద్ధెట్లా పుట్టిందా అనుకుంటూ! బ్రాహ్మణ కొంపలోపుట్టి, మడీమైలావద్దా నీకు. ఏమో, పిల్లా నేపోయిన తరువాత నీయిష్టము. నేనున్నన్నాళ్లు ఈ ఇంటిపద్ధతి నా ఇష్టమే గానీ నీఇష్టమేమీసాగదు'' యని చురచురా మాస్తూ లోపలికివెళ్లిపోయింది.

అప్పుడే పూజాగృహములోనికిపోయి, పూజచెయ్యడానికి కూర్చొని పూలకోస మెదురుచూస్తున్నాడు వకీలుగారు. భార్య పూలుకోసుకొని రాకపోగా తల్లి యీ తీరుగా కేకలు వెయ్యడమువిని, ''అమ్మా యేమిటి విషయము'' అని తల్లినడిగా డాయన. అందుకామె వలవలలాడుతూ, ''నీ పెళ్ళాముతీరు చూడునాయనా - దాసీదాని పిల్లాడిని కొంపలోకి తీసుకొచ్చి పాలుపోసి పెంచుతుందిట. ఏమిటేపిల్లా నీకిదేమిబుద్ధే అంటే పసిబిడ్డ దేవుడితో సమానము; తల్లిలేనిబిడ్డని పెంచితే తప్పాయని జవాబు చెప్పింది. దాన్నేఅడుగు నామాట అబద్ధమేమో. ఎన్నడైనా ఇల్లాంటి వెఱ్ఱిపనులు మనయింట మొనగుదుమూ? మాలాళ్ల పిల్లలకు నీళ్లుపోసి, పాలుపోసి పెంచడము, నాకేమీ బాగాలేమనాయనా. యీ కొంపలో నేనుండలేను. నన్నే కాశీకైనాపంపు ఆ తరువాత మీచిత్తమొచ్చినట్లుందురుగాని'' అని ఒక్కచదువు గుక్కతిప్పుకోకుండా చదివేసింది ముసలమ్మ.

శ్యామలాదేవి గుణవతి, విద్యావతి, సౌందర్యవతీ పతిభక్తిగలది. కాని తనకే కొరతా లేకపోయినా 30 సంవత్సరాలు నిండినస్త్రీకి బిడ్డలులేనికొరత ముఖ్యముగా కనబడుతుంది. అలాగే మనశ్యామలాదేవికిగూడా అమ్మాయని పిలచేబిడ్డ లేకపోయె ననేకొరత సహజముగాకల్గినది.

తల్లియొక్క ఆవేశమంతా అణిగిన తరువాత భార్యనిపిలచి ''శ్యామలా! ఏమిటీ గొడవంతా''యని ప్రశ్నించాడు.

శ్యా:-ఔనండి నిజమే ఆ పిల్లవాడికి తల్లిలేదు. కాబట్టి కొంచము బాధ్యత వహించవలసి వచ్చినది. అందుకే యీ గొడవంతాను.

కే:-తల్లిలేని పిల్లలంతా నీకే లభిస్తారేమి ఖర్మము. అది సరేకాని నీచజాతిబిడ్డను మనయింట్లోకిల్లా తీసుకొద్దామనుకున్నావు? కొంచము పూర్వాపరము లాలోచించవద్దా?

శ్యా:-హీనజాతిలో పుట్టడమే వాడుచేసుకొన్న పాపమా. ఏమి యిదంతా నాకేమో అగమ్యగోచరముగానున్నది.

కే:-మరి ఇదే ఆలోచించవలసినది. హిందూసంఘముయొక్క నియమాలు యెంత కఠోరమైనవో నీకు తెలియవా? మతనియమాల ననుసరించి నడచుకొనవద్దా మరి?

శ్యా:-ఆహా, యేమి ధర్మశాస్త్రమండీ. ఆత్మపవిత్రమైనది. అది అందరిలోనూ ప్రకాశిస్తున్నది. కాని అంటరానివారిలో ఆత్మనశించినదా? దేశికీ భేదములన్నీ.

కే:-ఐతే పెద్దలనాటి సంఘాచారాలు చెడ్డవనేనా నీయూహ?

శ్యా:-చెడ్డవని మెల్లిగా అంటారా? మనుష్యులు మనిషిని ద్వేషించే ఆచారము చెడ్డది గాక మంచిదా? నిజంగా చెప్పండి పాపపుణ్యాలెరుగని పసికూన; చస్తో నా చేతిలో పెట్టినదే, దానిమాట నెల్లా కాదనేది? మీకు, మీఅమ్మగారికి ప్రియమైనపని యేదైనా చెయ్యమంటే నేను చచ్చైనా పోతానుగానీ ఆ బిడ్డను విడవలేనండి,. (శ్యామలాదేవి కంట తడిబెట్టినది.)

ఇదివిని తల్లీకొడుకు స్తబ్ధులై యూరకున్నారు. ఇంకేమీ మాట్లాడలేక వకీలుగారు ఆఫీసులోకి, ఆయనగారితల్లి వంటయింట్లోకి వేంచేశారు.

రోజూ భోజనసమయమునకు శ్యామలాదేవి భర్తకు హితవైన పదార్థము లేవైనా స్వయముగా తయారుచేసి, వంటవాడు వండినపదార్థములు కూడా తెచ్చి తాను ప్రక్కను కూర్చొని సపర్యలుచేస్తూ ఆదరణగా ఆమాటా ఈమాటా చెపుతూ వడ్డనచేసే అలవాటు. కాని ఈ రోజున ఒక క్రొత్తయువతి వడ్డించ నారంభించినది. ఆమెకు 20 సంవత్సరాలు వుంటవి. పేరు సుసీల. కాని పేరుకున్న గాంభీర్యము ఆమెలో లేనట్లున్నది. వ్యవహారము, అనవసరముగా మాట్లాడుట, వెకిలితనముగా నవ్వుట, మొదలు పెట్టినదా అమ్మాయి. ఆయనకు కొంత చిరాకుగానే వున్నది. కానీ అన్నిటికీ మౌనముద్రవహించి గంభీరముగా కూర్చున్నాడు. ఇదేసమయములో తల్లిగారు లోపలనుండివచ్చి "అబ్బాయీ! సుసీల మంచి వంశములోనిపిల్ల. నాకూ కావలసినది. ఆగోడ్రాలివల్ల నీకేమి సుఖము. యీ పిల్లను పెళ్లిచేసుకో. నీకడుపున నాలుగు కాయలు కాస్తే చూచిపోదామని వున్నా. పెద్దముండనయాను నాయినా! ఈ ఒక్కమాటవిను," అని ప్రారంభించింది. ఇది తల్లిగారి ప్లానుగదాయని తెలుసుకొన్నాడు. "శ్యామలుండగా యీమెకూడా యెందుకమ్మా" యని ఒక్కమాటతో జవాబిచ్చి భోజనము పూర్తిచేసి లేచాడు.

వకీలుగారు కోర్టునుంచి వచ్చేవేళకు పలహారపు పళ్లెము బల్లమీదపెట్టి, కాళ్లు కడుక్కొనేనీళ్లు చేతపట్టుకొని తుడుచుకొనే తువాలు మడతబుజానవేసుకొని తయారుగా నిలచునుండే శ్యామలాదేవి నేడు కనపడలేదు. కాని ఈ క్రొత్తపిల్లే అన్నీ అక్కడపెట్టి ప్రక్కగదిలోకి చక్కాపోయింది. యీ క్రొత్తమార్పు ఆయనకేమీ తృప్తిగా లేదు కాబట్టి ముందు శ్యామలని వెతక నారంభించాడు చివరి

గదిలో ఆ పనిదానిపిల్లవాడి నాడిస్తున్నది ఆమె. మాసినచీర, తైలసంస్కారము లేక రేగివున్నతల ఆవాలకముచూచి ఆయన యేవగించుకొన్నాడు. భర్తనుచూచి భయపడుతూ పిల్లవాడి నక్కడ పడుకోబెట్టి లేచి నిలచున్నదామె. 'శ్యామలా నీకిదే లోకమల్లె వున్నదే అన్నా"డాయన. "స్త్రీకి తనబిడ్డకంటే మరొక లోకమేముంటుందీ? నన్ను క్షమించండి మీకుపరిచర్యలు చెయ్యనందుకు. సుసీలను వివాహము చేసుకొని సుఖించడమే నాకూ సమ్మతము" అని వూరుకున్నది శ్యామలాదేవి. "శ్యామలా నేను ఏకపత్నీవ్రతుడనేకాని ద్విపత్నీవ్రతుడను కాను. ఇల్లాంటిమాటలు నాకెప్పుడు చెప్పవద్దు. కాగా నీలో యేమయోగ్యతచూచి నేను పునర్వివాహము చేసుకొనేది?"

"ముఖ్యముగా మీతల్లిగారి అభీష్టసిద్ధికొరకు. అది నావుద్దేశ్యములో లేదు; జాతకములో లేనివి ప్రయత్నమువలన ఫలించవని నాకు తెలుసు. కాబట్టి సుసీలకు తగిన వరుడిని తెచ్చి పెండ్లైనా చేస్తానుగాని, యిటువంటి అనుచితమైన పనులు నేనెంత మాత్రమూ చేయజాలను. సుసీల నాకు సోదరీ సమానురాలు." భార్యాభర్తలయొక్క సంభాషణంతా ప్రక్కగదిలోనుండి శ్రద్ధగావిన్నది సుసీల. ఇదంతా ముసలామె ప్రేరేపణే గాని, దాసుగారి అభిప్రాయము కాదుగదాయని తెలుసుకొన్నది. తనకిక్కడ స్థానము లేదుగదాయని ఒక్క నిట్టూర్పువిడచి చెప్పకుండా యెక్కడికో వెళ్ళిపోయింది. ఇంతా మక్కువపడినా దక్కలేదు బిడ్డ.

ఒకనాటి సాయంకాలము పూలచెట్లకు నీళ్ళుపోస్తున్నది శ్యామలాదేవి. వీధిలో పిల్లలెవరో పాడుతున్నట్లు వినిపించినది. ఏమిటా కోలాహలమని ఒక్క అంగలో వాకిట్లో కొచ్చింది. చాలామంది పిల్లలు పది పన్నెండు సంవత్సరాల వయస్సుపిల్లలు, ఖద్దరుదుస్తులు, గాంధీటోపీలు ధరించి, చేతిలో జాతీయ పతాకములు బట్టుకొని వూరేగుతున్నారు. అందరూకలసి జాతీయగీతము పాడుతున్నారు. పాట ఆపి జట్టులోనుంచి యిద్దరు పిల్లలీమె వద్దకువచ్చి, "అమ్మా, దేశసేవ కొకపైసా యివ్వమ్మా" అన్నాడు. మరొకడు "బీదల సహాయానికి పాటుపడుతున్నాము, బెంగాలులో కరువచ్చి ఆకలితో యెక్కడివాళ్ళక్కడే చచ్చిపోతున్నారు. మనమందరమూ బీదవాళ్ళకు సహాయము చెయ్యాలి తల్లీ!" యని సంచిజాపాడు. "అమ్మా" యనే మధురధ్వని యీమె చెవులకెంత యింపుగానున్నది. అల్లామళ్ళా పిలవమని ఆ పిల్లలనడిగి పిలిపించుకొన్నది. వారి మాటలకు మురిసిపోయి యెత్తుకుముద్దాడినది. ఇల్లాంటిపిల్లలనుకని దేశసేవ కర్పించిన ఆతల్లి యెంత ధన్యురాలాయని తలపోసినది. తన కటువంటిభాగ్యము కలుగనందుకు మనసులోనే చింతించినది. తన వేలినున్న బంగారు వుంగరముతీసి ఆ పిల్లవాడిసంచిలో వేసి సంతసించుతు ఆ బాల సమూహము కనుపించునంతవరకూ చూస్తూ అల్లాగే నిల్చున్నదామె.

——o)——



# మామిడి



## మామిడి పండ్ల పచ్చడి

నాలుగు తియ్యని మామిడి పండ్లనుదెచ్చి వాటియొక్క చెక్కు దీసి, సన్ననిముక్కలుగా తరిగి ఒకకళాయి పాత్రలో నుంచవలెను. తరువాత దానిలో నాలుగు తులముల చక్కెర కలుపవలెను. ఒకయినుప కళాయిలో నాలుగు తులముల నెయ్యివేసి కాగినతరువాత పొట్టుతీసి సన్నగా తరిగి నాలుగు తులముల అల్లపు ముక్కలనువేసి సగము వేగినతరువాత ఒకతులము జీలకఱ్ఱ పొడియు, ఒక తులము ధనియాల పొడియువేసి అన్నియు వేగుటచూచి మామిడిపండ్ల ముక్కలలోకలిపి మూతపెట్టవలెను. ఈ పచ్చడి మిగుల రుచికరముగా నుండును. సమ శీతోష్ణమును కలుగ చేయును. విరోచన బద్ధకము పోగొట్టును. వ్యాధి గ్రస్తులుకూడ భుజింపవచ్చును.

## మామిడి తాండ్ర పచ్చడి

మాధుర్యమును, పులుపును కలిగి యున్నటువంటి యిరువది తులముల మామిడి తాండ్రను తెచ్చి యుంచవలెను. ఒక బాణలిలో ఆరు తులముల నీళ్ళుపోసి, బాగుగా మరుగుటచూచి, మామిడితాండ్ర వేయవలెను. ఇట్లు రెండు మూడు నిమిషములు ఉడికిన తరువాత నాలుగు తులముల చక్కెరయు, యిరువదియైదు గురిగింజలయెత్తు సైంధవలవణపు పొడియు (ఉప్పుకూడ వేయవచ్చును) వేసి బాగుగా కలియబెట్టవలయును. అప్పుడే రెండు గురిగింజలయెత్తు కుంకుమపువ్వు పొడికూడ దానిలో కలుపవలెను. తరువాత ఒక యినుపపాత్రలో ఒక తులము నేయివేసి నిప్పులమీద యుంచి, సన్నగా తరిగిన అల్లపు ముక్కలు నాలుగు తులములు వేయవలెను. అల్లపు ముక్కలు మూడుపాళ్ళు వేగుటచూచి అరతులము జీలకర్రను అందులోవేసి మామిడి తాండ్రలోకలిపి మూతపెట్టవలయును. కావలసినవారు నాలుగు తులముల మిరియములను నేతిలోవేయించి పొడిచేసి ఆ పచ్చడిలో కలుపుకొనవచ్చును. ఇది రోగులకు కూడ మంచిది; జీర్ణకారి, కొద్దిగా వేడిచేయును.

## మామిడి పండ్లు నిల్వచేయు విధము

గట్టిగా నుండునవి, తొడిమెలు తీయకుండా యున్నటువంటివి, పదిపండ్లనుతెచ్చి గాజుజాడీలో యుంచి, కాచినటువంటి నమ్మకమైన తేనె ఒకశేరు ఆ కాయలలో పోయవలయును. తరువాత దానిలో ఒకశేరు ఆవునెయ్యి, యిరువది తులములు శ్రేష్ఠమైన మిరియముల పొడియువేసి, బాగుగా కలిపి, మూతపెట్టి భద్రముగా నుంచుకొనవలెను. ఈ మామిడికాయలు రెండు మూడు సంవత్సరముల వరకు నిలువ యుండును. ఇవి రోగులు, గర్భిణీస్త్రీలు మొదలగువారు భుజింపవచ్చును. మామిడిపండ్లు లేనికాలమున తినదలచుకొన్నవారిట్లు చేయుట మంచిది. ఆ పండ్లు తినబోవునపుడు వేడినీళ్ళలో కడుగవలయును.

## మామిడిపండ్లను నిల్వచేయువిధము (2)

పండు వర్ణము వచ్చినటువంటి మామిడిపండ్లను యేబదితెచ్చి ఒకగాజు జాడీలో నుంచవలెను. తరువాత అయిదారు పర్యాయములు వడియకట్టిన ఏటినీళ్ళనుతెచ్చి ఆ కాయలు మునుగునట్లు గాజు జాడీలో పోయవలెను. అంతట ఒకశేరు కలకండ పొడియు, ఒకశేరు ఉప్పు పొడియు అందులో వేసి కలిపి మూత యుంచవలెను. ఇవికూడా చాలాకాలము నిలువయుండి రుచికరముగా నుండును.

## మామిడి పండ్ల షర్బత్తు

తీయనైనటువంటియు శ్రేష్టమైనటువంటియు మామిడి పండ్లనుతెచ్చి రెండు శేర్లు రసమును తీయవలయును. తీసిన రసమును ఒకకళాయి పాత్రలో పోయవలయును. అందులో పదితులముల యాలకుల పొడియు, యిరువది తులముల పన్నీరును, ఒకతులము పచ్చకర్పూర పొడియు, పదిగురిగింజలయెత్తు కుంకుమ పొడియు వేసి బాగుగా కలియబెట్టవలయును. తరువాత నలుబది మాలతీ పుష్పములను, యిరువది కదంబ పుష్పములను, ఒకవేళ ఆపుష్పములు దొరకనియెడల తొడిమెలు తీయనటువంటి 100 మల్లె పుష్పములనైనను దానిలో వేసి మూతపెట్టి మూడుగంటల కాలముంచవలయును. తరువాత శేరున్నర పంచదార పాకముపోసి కలియబెట్టి వడియ కట్టవలయును. (వడియకట్టిన వస్త్రము మందమైనదిగా నుండవలయును) ఈ షర్బత్తు ప్రతిదినమును అయిదు తులముల చొప్పున పుచ్చుకొనవలయును. నీళ్ళు కలప కూడదు. వాతమును పోగొట్టును, వేసవి కాలమందు మిగుల చల్లదనమొసగి ఉత్సాహవంతుల జేయును.

## మామిడికాయ ఆవకాయ

బాగుగా ముదిరినటువంటివి, పెద్దవైనటువంటివి, మిక్కిలి పుల్లగా యున్నటువంటివీ, పీచుగలవి నూరు మామిడికాయలనుదెచ్చి శుభ్రముగాకడిగి, నాలుగు భాగములుగానరికి, జీడీతీసివేసి, క్రొత్తది యగు తాటియాకు చాపమీదగాని, చాటలోగానీ యుంచవలెను. వంద మామిడికాయలకు, అయిదు శేర్ల [నాలుగుశేర్లన్నర కొందరు వాడెదరు] సన్న అవాలుదెచ్చి రాళ్ళు మొదలగునవి తీసివేసి, ఎండబెట్టి మెత్తగాదంచి యుంచుకొనవలెను. అర్ధశేరు పసుపుపొడి తెచ్చి వేరుగానుంచవలెను. అయిదుశేర్ల మిరప కాయలయొక్క తొడిమెలుతీసి, ఎండబెట్టి, విత్తనములు కనబడకుండా మెత్తగా దంచి యుంచుకొనవలెను. అర్ధశేరు మంచిమిరియాలు, రాళ్ళులేని అర్ధశేరు మెంతులు, ఒకశేరు అల్లము (బాగుగా కడిగి, సన్నగా తరిగి, యుంచవలెను. యీ మూడింటిని వేరుగా భద్రము చేయవలెను. ఆయిదు తులముల మంచినూనెను బాణలిలో వేసి, పొయ్యిమీదపెట్టి కాచి మూడు తులముల ఇంగువను వేయవలెను. ఆ ఇంగువను పొడిచేసి నూనెలోకలిపి మన్నులేని రెండుశేర్ల ముప్పావు ఉప్పుపొడి, పైనచెప్పిన అవాల పొడి, పసుపుపొడి, మెంతిపొడి, మిరియాలపొడి, అల్లం యీ పదార్థము లన్నియు వేయవలెను. నూనెలో యివిఅన్నియు కలిపినతరువాత ఒక క్రొత్త కుండగాని జాడీగానితెచ్చి దానిలోయుంచి ముక్కలుకలుప వలెను. అంతట ఒక కుండను పొయ్యిమీదపెట్టి పావుశేరు మంచినూనెపోసి దానిలో అరతులము యింగువ వేసి కాచవలెను. నూనె పొంగువచ్చిన తరువాత దించి ముక్కలుయున్న కుండలో నలుప్రక్కల రాచి మిగిలిననూనె యంతయుపోసి మూతపెట్టవలెను. వారములేక పది దినములయిన పిమ్మట మరియొకసారి నలుప్రక్కల కలిపి దాచుకొనవలయును.

వాశిరెడ్డి సుశీలాదేవి.

# గృహిణి — సంస్కృతి

శ్రీమతి సూర్యదేవర సులోచనాదేవిగారు

సంస్కృతి సామాన్య మానవులను ఉత్తమ మానవులుగా మారుస్తుంది, సంస్కృతి సంపర్కంతో గృహిణి గృహలక్ష్మిగా మారుతుంది. మానవ సంస్కృతికి నారి పుట్టినిల్లు. గృహస్థుని గౌరవం అంతా గృహిణి సంస్కృతిపై నాధారపడి యుంటుంది. పాలను నీళ్లుగానూ, నీళ్లను పాలుగానూ మార్చగల సత్తా గృహిణిచేతిలో నుంటుంది. ఇంటికీ, ఇంటియజమానికీ మంచితనాన్ని తేవాలంటే గృహిణి విద్యావతిగా నుండటం మాత్రమేచాలదు, సంస్కృతినికూడ కలిగియుండాలి.

విద్య - మనం మామూలుగా అనుకుంటున్న విద్యకూ సంస్కృతికీ చాల తారతమ్యమున్నది. విద్య కేవలం బుద్ధిబలాన్ని వృద్ధిపొందించుకొనే ఒక యంత్రంగా నుండిపోయింది, విద్యకూ జీవితానికీ సంబంధం దూరమైపోతూ వచ్చింది. మానవ వికాసానికి విద్య ప్రథమావసరం; దీన్ని కాదని ఎవరూ అనజాలరు; అనకూడదు. అయితే మానవ వికాసానికి విద్య మాత్రమే చాలదు; సంస్కృతికూడ కావాలి. అసలు విద్య యొక్క లక్ష్యంకూడ మానవులకు సంస్కృతిని అందించుటే. కాని నేడు విద్యకూ సంస్కృతికీ సంపర్కం సన్నగిలిపోతూంది. విద్యావతులలో చాలామందికి సంస్కృతి లేకపోవటం, విద్యావతులు కానివారిలోకూడ కొందరికి సంస్కృతి యుండిపుండటం పరికిస్తే విద్యకూ సంస్కృతికీయున్న సాన్నిహిత్యం ఎంత దూరమైపోతున్నదీ విశదమవుతుంది. విద్య నూతన విషయాలను నేర్పుకొనే సాధన మాత్రంగా నిలచింది. సంస్కృతి ఆ నేర్చిన విషయాలను జీవితంలో ప్రతిబింబింప చేసేస్తుంది.

సంస్కృతి అంటే ఏమిటి? సంస్కృతి అంటే చిత్త సంస్కారం అని అర్థం చెప్పుకోవచ్చు. సభ్యతవేరు, సంస్కృతివేరు. సభ్యత మానవుని బాహ్యస్థితిని మాత్రమే తెలియజేస్తుంది; సంస్కృతి మానవుని ఆంతర్యస్థితిని వ్యక్తపరుస్తుంది. ఒకరు ఏవిధమైన చీరెలు కట్టుకున్నారు, ఎలాంటి గృహంలో నివసిస్తున్నారు, ఏరకమైన ఆహారాన్ని భుజిస్తారు, ఏతరహా వాహనంలో తిరుగుతారు అనే ఇలాంటి జీవితపు బాహ్యస్థితిని చూపుతుంది సభ్యత. ఇక ఒకరు ఏమాదిరి ఆలోచనలను ఆలోచించేదీ,

ఏవిధమైన అనుభూతులను అనుభవించేదీ, దైనందిన జీవితంలో ఏరకంగా ప్రవర్తించేదీ, ఎలాంటి ఆశయాలనూ, లక్ష్యాలను కలిగివుండేదీ వ్యక్తపరుస్తుంది సంస్కృతి.

ఒకరు గొప్ప మేడలో నివసిస్తుండవచ్చు; రోల్సురాయిస్ కారులో తిరుగుతుండవచ్చు; బంగారు బుటేదారుపనిచేసిన పట్టు వస్త్రాలను ధరిస్తుండవచ్చు; కాని వారి ఆలోచనలూ, అనుభూతులూ, ఆశయాలూ చౌకరకంగా నుండవచ్చు. ఇటువంటివారికి సభ్యత యున్నదికాని సంస్కృతి లేదనాలసియుంటుంది. ఇంకొకరు పర్ణకుటీరంలో నివసిస్తుండవచ్చు; కాలినడకను తిరుగుతుండవచ్చు; జీర్ణవస్త్రాలను ధరిస్తుండవచ్చు; కాని వారి ఆలోచనలూ, అనుభూతులూ, ఆశయాలు చాల ఉన్నతస్థాయికిగనుక చెందియుంటే, వీరిలో సభ్యత లేదనలేము కాని, సంస్కృతి మాత్రం యున్నదంటాము. సభ్యత, సంస్కృతి ఒకేచోట నుండవనేదిలేదు. సభ్యతా, సంస్కృతీ రెంటినీ సమంగా అలవరచుకోటమే అందరికీ లక్ష్యంగా నుండాలి. సభ్యతనుకూడ చిన్నచూపు చూడరాదు.

ఇక గృహిణికి ఎలాంటి సంస్కృతి అవసరం అనేది ఆ గృహిణియొక్క పరిసరాలపైనా, గృహయజమానియొక్క మనోవికాసంమీదా, గృహిణియొక్క స్వంత ఆదర్శాలపైనా ఆధారపడి యుంటుంది. మామూలుగా పురుషుల్లో ఆలోచనాపటిమ అధికంగా నుంటే స్త్రీలలో అనుభూతి శక్తి లోతుగా నుంటుంది. అందువల్ల స్త్రీలలో రసతృష్ణ అధికం; సౌందర్యానుభూతి బలీయం. నిజంగాచూస్తే సంస్కృతికి ప్రధానమైంది కళారాధన. మహిళ తన సంస్కృతిని పెంపొందింప జేయాలంటె తన హృదయ శక్తులను జాగృతంచేయాలి; తన రసపిపాసకు చైతన్యం ప్రసాదించాలి; తన కళోపాసనకు కాంతిని కలిగించాలి. వీటి సిద్ధికై గృహిణి తన దైనందిన గృహకార్యాలనుంచి దూరంగా నుండ నవసరంలేదు.

గృహిణియొక్క సంస్కృతి వికాసానికీ, కళాకలాపానికీతోడు జీవితపు కొన్ని సుగుణాలనుకూడ అలవరచుకోవాలి. ఇతరుల ఉన్నతినిచూచి అసూయ చెందకుండా నుండటం, దీనదరిద్రులకు సహాయపడే అభిలాష, నిష్కపట, కరుణ, ప్రేమ ఇలాంటి గుణాలు సంస్కృతికి ముఖ్యాంగాలు. గృహంయొక్క కల్యాణం గృహిణిపైనా, దేశంయొక్క కల్యాణం గృహంపైనా ఆధారపడివుంటుంది, అనగా దేశంయొక్క కల్యాణం గృహిణిమీద నాధారపడినది. కనుక గృహిణిలో సంస్కృతియుంటే దేశంలో సంస్కృతి యుంటుంది.

—o—

# ఆదర్శమిథునం

శ్రీ చీమలపాటి
సూర్యనారాయణరావుగారు

(గత సంచిక తరువాయి)

ఆ కారణంచేత - నాలో రేగిన కోర్కెలను చల్లార్చుకొని, గోముగా ఆమెను నిమురుతున్నాను. నా స్వార్థలాభము గురించి అమాయకురాలైన మా కాంతాన్ని బలిచేయలేను; చేయను: చేయబోను.

మా యావిడ గమ్మున కళ్లువిప్పి కిలకిల మని నవ్వింది.—"అమ్మ, దొంగా, తెలిగేసేవుండి టక్కు వేసావా? యెప్పుడు వచ్చేసేవు నాపక్కలోకి?" అని ప్రశ్నించా నామె నింకా దగ్గరగా లాగుతూ. "గంటక్రితం! - అబ్బా ఎంత పిలిచినా లేచారు గాదు!" అంది ముద్దుగా మెల్లగా.

"ప్రయాణపు బడలిక నుంచి యిట్టే నిద్దర పట్టేసింది పండుకోగానే!" అన్నాను... ఇరువురం తెగి తెంపులు కాని లోకాభి రామాయణం మాట్లాడుకుంటున్నాం మెల్లిగా.

ఇంతలో మా యావిడ—

"'సూరిపిల్ల,' పుట్టింటికి వెళ్లిపోయిందా?" అని ప్రశ్నించింది. 'సూరిపిల్ల' యెవరబ్బా? అని నాలో నేనే ఓ మారు వితర్కించుకుని, తెలియకపోవటంచేత—

"ఏ సూరిపిల్లా?" అని ప్రశ్నించాను.

"మనింటికప్పుడప్పుడూ వచ్చీసు అడుకునేందుకు వస్తూవుండేది; మొన్ననే పెళ్లి, కార్యం అయిన పిల్లండి!—" అంది. "ఓః!—ఆపిల్లా!" అన్నాను. "మా ఇద్దరికెంత స్నేహమనుకున్నా!" రంది.

"దానిపేరు - సూరిపిల్లగాదే 'సరస్వతి'!" అన్నాను.

"ఏఁ? — మీరు బొద్దుకోసి, పేరుపెట్టేరాయేఁ?" అంది నవ్వుతూ.

"...పాపం, 'సూరిపిల్ల' (వాళ్ల తల్లిదండ్రులు పెట్టిన ముద్దుపేరు!) భర్త మొన్న అత్తారింటికి వచ్చి కొన్ని దినములుండి, మరల తన స్వగ్రామము విజయనగరం బస్సుమీద వెళ్లిపోతున్నాడు. మాచిఖండ్ నుంచి వస్తూన్న లారీ, యీబస్సు డీకొని - ఆ ప్రమాదములో జారిపోయాడు!" అన్నాను డగ్గుత్తికతో.

"అరెరే—యెంత ప్రమాదం జరిగింది! పాపం, చనిపోయాడా? రామ రామ! మొన్ననే - కళ్యాణం జేసేరండి; సంబంధాలు గురించి అన్వేషించడంలో విసిగి విసిగి. కార్యంకూడా జేసేరండి. వారిద్దరికి యీడూ జోడూ సరిపోయిందని యెంతో మురిసి పోయానండి... ఆ పిల్లకింకా వొళ్లు పచ్చైనా ఆరకుండా వైధవ్యం సంప్రాప్తించింది. ఇఁక - ఆమెగోడు ఆలకించేదెవరు? సూరిపిల్ల పుబుకు యిక నుండి - మారటి తల్లి పిల్లలూ పట్టించుకోరు: యీమె అంటే వాళ్లకి బొత్తిగా గిట్టదు. నానా బాధలు పెట్టేవారు.

నాతో జెప్పుకుని యప్పుడప్పుడూ యేడ్చేది. ఆమె జీవితం - జగదాంబ జీవితం వొక్క మల్లేవుంది. ఇక తండ్రి సూరిపిల్లను చచ్చేవా? బ్రతికేవా? అన్నంతిన్నావా లేదా? అని యెప్పుడూ ప్రశ్నించిన పాపాన పోలేదు! తన రెండవ ముద్దుల పెళ్లాం యెట్లా చెబుతే అట్లాగే ప్రవర్తిస్తాడు. ఆమె దుర్బోధ నుంచి, సూరిపిల్ల నప్పుడప్పుడూ కొట్టడంకద్దు—"

"అయ్యో, మూర్ఖుడా? తండ్రే!" అన్నాను అక్కజంగా.

"వాడు తండ్రి అంటే తండ్రిగాదండి. వాడి ముఖం యీడ్వా! కర్రల్లో పెడితే తిరిగివచ్చేస్తాడు. ఆ పెళ్లాం మాటలు విని, కన్న కూతుర్నే యిన్ని బాధలు పెడతాడనుకుంటారు! తండ్రి - పినతల్లి, పిల్లలు దీన్ని యెన్ని బాధలు పెట్టినా భూదేవి మల్లే సోర్చుకుంటుంది వాళ్లకు యెదురు తిరగలేదు."

"ఆ యింట్లో - యీ పిల్లంటే యెవరికీ గిట్టదన్న మాట! ..."

"బొత్తిగా గిట్టదు... అందులోకి మారటితల్లి కీమెఅంటే సుతరాముఁగిట్టదు; యింటిలోని బండెడు చాకిరిని తనుగాని తనపిల్లచేత, తల్లిచేత, నాయనమ్మ చేత; చేయక, చేయించక, యీపిల్లచేతఁ జేయించి యింకా కసిదీరక లేనిపోని కారణాలు కల్పించి మొగుడు చేత, అప్పుడప్పుడూ తనూ తంతూవుంటారు..."

"రామ రామ, స్త్రీ జీవితమంటే యిలాగా వుంటుంది!" అన్నాను; దీనంగా.

"యింతగంటే ఘోరమైన కష్టాలను అనుభవిస్తున్న స్త్రీలు నేటి పురుషుల యినుప పాదాలు క్రింద వున్నారు; కొందరు స్త్రీలను దేవతల్లే పూజిస్తూన్న - మీవంటి మగవారూ వున్నారు; లేరని చెప్పడానికి నాకు నోరురాదు; అయితే - స్త్రీలను - "పరాయిపిల్ల మనింటి కెందుకు వస్తుంది; ఆమె గూడా మనవంటి మనిషే; ఆమె యభిరుచిని బట్టి నడుద్దామనే సద్భావముతో గౌరవించే మగవారు గాంధీమల్లే కోట్ల ప్రజలలో పుడుతూ వుంటారు. అటువంటివారి పాదాలకు వంగి ప్రొక్కాలని యుంటుంది; పూజించాలనే సద్భావం హృదయములో జనిస్తుంది -" అని ఆవేశ పూరితమైన హృదయంతో చెప్పసాగింది. నేను మౌనంగా వుండి, యీమె జెప్పే ప్రతీ యావేశపూరితమైన మాటను ప్రస్ఫుటంగా వింటూనే యున్నాను.

"అయితే — సరస్వతి గోడు, యాక్రందన నాలకించేవారా సంసారంలో యింక లేనేలేరా?" అన్నా.

"లేకేం? వున్నారు. కలకత్తాలో - యిటీవల స్థాపించబడిన - "డివిశాఖ్ ఫిలిం యిండస్ట్రీస్"లో నటుఁడుగాను, స్క్రిప్టురైటరుగాను పనిజేస్తున్నాడు. నెలకు - రు. 5,000లు జీతం డ్రాజేస్తున్నాడు, మంచి స్ఫురద్రూపి తెలివైనవాడుగూడా. హెడ్డాఫీసు - విశాఖపట్నంలో వుంది. ఫిలిం షూటింగు జరిగేటప్పుడందరూ కలకత్తా వెళుతూవుంటారు. మొన్న మొన్నటివరకు విశాఖపట్నములోనే యున్నాడు"

"ఆఁహాఁ... యిప్పుడే ఫిలిం షూట్ జేస్తున్నారో? -" అన్నాను.

"'లవ్ నైట్'! (తెలుగులో!) దీస్తున్నారు; హిందీలోకిగూడా డబ్ జేస్తారుట!" అంది.

"యీ విషయాలన్నీ నీకెట్లాదెల్సు? అతని పేరేం పేరు?" అని ప్రశ్నించాను.

"వాళ్ల - సరస్వతి చెప్పింది. అతని పేరు: 'ఎ. రాజేశ్వరరావ్.' ఇతను సరస్వతికి స్వయం తోబుట్టువు. వీళ్లిద్దరూ మొదటి పెళ్లాం సంతానం! కానీ వొక్కదానికి నేను సంతోషిస్తున్నాను..." అంది.

"దేనికి? -" అని ప్రశ్నించాను!

"రాజేశ్వరరావంటే - యింట్లోవున్న తండ్రి లగాయితు, చిన్న పిల్లలు వరకు గడగడ వొణుకుతారు. ఇతనికి ఆయింట్లో యెవరైనా యెదురు చెప్పారో - వాళ్లకావేళ వొళ్లు హూనమయిందన్నమాటే! రాజెవర్ని లక్ష్యపెట్టడు! సవతి తల్లి వాసన బొత్తిగా గిట్టదు. తండ్రి నైజమితనికి బాగా దెలుసును గాబట్టి - తండ్రిని చెడామడా తిట్టడమే గాకుండా, తండ్రిని జూచే విధంగా గాకుండా, పరాయివానిలాగ జూస్తాడు. అతనికున్న వెధవగుణములనుంచి, వొకనాడు —

(సశేషము)

# జట్కావాడు

హిందీమూలం :
శ్రీ విశ్వంభరనాథ్ శర్మ "కౌశిక"

అనువాదం :
శ్రీ కొల్లిపర సౌభాగ్యరావు

(గతసంచిక తరువాయి)

నామాట వినగానే యజమాని మనస్సు చలించినట్లయింది. "అసలు విషయ మేమిటో చెప్పు" అని మెత్తబడి అడిగాడు.

"ఆ విషయం మనవిచేసుకున్నందువల్ల లాభమేమీ వుండదు నాలెక్క చూచి జీతం దయచేయించండి."

అయినా యజమాని నన్ను వదలలేదు. చెప్పేదాకా పట్టుబట్టాడు. గత్యంతరం లేక నేను జరిగిన ఘట్టమంతా పూసగుచ్చినట్లు చెప్పివేశాను. యజమాని నామాటలు నమ్మడని నామనస్సులో వేధించుతూనే ఉంది. నేను భావించినట్లు జరుగలేదు. యజమాని నావీపు నిమురుతూ "శభాష్ శ్యామలాల్, నేను నీమాటలు నమ్మాను. నాకు చాల ఆనందం కల్గింది. ఇక నీవు నిర్భయంగా, నిస్సంకోచంగా, సంతోషంగా వుండు. నీకేమీ భయంలేదు. నీవంక కన్నెత్తి చూచేవాడెవడూ ఉండడు. నాదీ జవాబుదారీ, నీకే అపకారం కల్గినా" అని హామీ చేశాడు. అప్పటినుంచి నా కెవరన్నా లెక్క లేదు. రాజునై పోయాను. ఎక్కువగా యజమానితో బయటి పనుల్లోనే పాల్గొంటున్నాను. ఇంట్లోకి వెళ్లటంలేదు. పిమ్మట యజమానురాలు నన్ను నౌకరీలోనుంచి తీయించివేయాలని లక్షప్రయత్నాలు చేసింది. యజమాని ఆమె మాటలను పీసమంతైనా లక్ష్యంచేయలేదు. కోరలు పూడబీకిన సర్పమై పోయింది.

ఇట్లా ఒక సంవత్సరం గడిచింది. ఈ మధ్య యజమాని పినతండ్రి కుమారుడు ఎక్కువగా రాకపోకలు ప్రారంభించాడు. అతడు ఇరవై, ఇరవైయైదు సంవత్సరాల ప్రాయంగలవాడు. ఆరోగ్యవంతుడు. ఒడ్డూ, పొడుగూగల మనిషి. అతని రాకపోకలలో మొదట నాకేం సందేహం కల్గలేదు. కాని అతని రాకపోకలు హద్దుమీరి పోయినవి. యజమానురాలితో గంటలకొలది కూర్చొని మాట్లాడుతూ ఉండటం చూచాను. ఇందులో ఏదో కిటుకున్నదని నాకు అనుమానం కల్గింది. యజమాని ఎప్పుడూ దుకాణం దగ్గర ఉంటూ ఉండడంవల్ల ఆయనకు ఈరహస్యం తెలియనే తెలియదు. ఆయింట్లో నీళ్లు పోస్తూఉండే యింకో నౌకరు ఉన్నాడు. యజమానురాలు వాడినోరు కట్టివేసింది.

ఈ రహస్యం బయటకు పోక్కే అవకాశమేలేదు. ఇక ఈ రహస్యోద్ఘాటన నావల్లనే జరగాలి యజమానికి. రహస్యాన్వేషణకు నడుము బిగించాను. చివరకు వారిదుష్కరి పాపకార్యం కన్నులారా చూచాను. వెంటనే యజమానికి తెలియజేశాను. నామాటను యజమాని మనస్సులో దాచిఉంచాడు. ఒకవారం గడిచింది. యజమాని నన్ను పిలిచి- "శ్యామలాల్, నీమాట సత్యమేనోయ్. ఇవాళ నేనూ ప్రత్యక్షంగా చూచాను. నీవు చెప్పినప్పటినుండీ ఈ అన్వేషణలోనే ఉన్నాను. నేడు నీమాట సత్యమని బోధపడింది. ఇప్పుడేమి చేయమంటావో చెప్పు" అని అన్నాడు.

"నేచెప్పేదేముంది బాబూ, తమకు న్యాయమని తోచిందేదో చేయండి."

"నేనీవయస్సులో వివాహంచేసుకొని పొరపాటుచేశాను. కాని ఇప్పుడేం చేయమంటావు?"

"తమ తమ్ముణ్ణి ఇక రానివ్వకండి. ఇదే మంచి ఊహాగా తోస్తున్నది. ఇంతకంటే మనమేమిచేయగలం?"

"అవును, ఇదే చక్కటి ఉపాయం. దీన్ని ఇంట్లోనుంచి గెంటి వేద్దామన్నంత కోపం కల్గుతూవుంది. ఈ విధంగా చేస్తే వంశానికి అమర్యాద. ఈ వయస్సులో పెండ్లి ఎందుకు చేసుకోవాలి, ఎందుకు ఇంట్లోనుంచి వెళ్లగొట్టాలని సంఘంచెప్పుకొని నవ్వుతుంది."

"నిజమే, మీరుచెప్పినది బాగానే ఉన్నది. అతని ఆట కట్టేటట్లు రాకపోకలు ఆపివేయించండి. ఆరోజునుంచే యజమాని లేనిదే బయటి వ్యక్తులుగాని, బంధువులుగాని ఎవరూ లోపలకు రాకూడదని శాసనం చేయబడింది. ఎవరినీ లోపలకు పోకుండా చూచేభారం నాకు వప్పగించారు. యజమాని పినతండ్రి కుమారుణ్ణి నేను ఆరోజునుంచీ లోపలకు రానివ్వనేలేదు. అతడు నాకెన్నో ప్రలోభాలు చూపాడు, బెదిరించాడు, భయపెట్టాడు. నేనతని ఆశలకు, బెదిరింపులకు లొంగలేదు. వాటి నన్నింటినీ అలక్ష్యం చేశాను. యజమానురాలున్నూ నన్నెంతో బ్రతిమాలింది, స్తుతించింది. అయినా నేను మెత్తబడలేదు. నీళ్లు తెచ్చేవాడు - "జరుగుతూ ఉన్నదేమో జరుగనియ్యి. వాటితో నీకెందుకు లేనిపోయింది" అని నీతి చెప్పవచ్చాడు. నేను - "నువ్వు చెప్పవచ్చావటరా! ఇంట్లోతిని ఇంటి వాసాలు లెక్కబెట్టిన చందంగా యజమాని ఉప్పూ, పులుసు తిని ఆయనకే మోసం చేయటమా! నీవు చూడగా వచ్చిమోసగాడివలె ఉన్నావు. నాల్గురోజులు బ్రతుకదలచితే నోరు మూసుకుని మెదలకుండా ఉండు, లేకపోతే రేపీ పాటికి నౌకరీలోనుంచి తీసివేయించుతా"నని బెదరగొట్టాను.

నామాటలు విని నీళ్లుతెచ్చేవాడు బ్రతుకు దేవుడా అని మౌనం వహించాడు.

కొన్నాళ్ళకు యజమాని బంధువు అసలు ఇంటికి రావడమే మానివేశాడు. యజమానితో మాట్లాడుటకు కొట్టుదగ్గరకు కూడ రావడంలేదు. ఇంతవరకు జరిగిందేమో సవ్యంగానే జరిగింది, బాగానే ఉంది. గండం గడచిందని నేననుకున్నాను.

ఆరుమాసాలు గడచిన తర్వాత ఒకరోజున యజమానికి కలరా తగిలింది. వెంటనే డాక్టర్లను, వైద్యులను పిలిపించి హడావుడిగా మందుమాకులు ఇప్పించాను. ఎన్ని యత్నాలు చేసినా ఫలించలేదు. యజమాని ఇక లాభం లేదనుకున్నాడు. నన్ను మంచందగ్గరకు పిలిచి "శ్యామలాల్, నేను నిన్ను నౌకరుగా తలంచడంలేదు. బిడ్డగా చూచుకుంటున్నాను. అందుచేత నా కొట్టు తాళం చేతులు నీకిస్తున్నాను. నామరణానంతరం తాళపు చేతులు నా కుమారుడికి ఇవ్వాలి. ఎవరినీ, వాడు రానంత వరకూ కొట్టును తెరవనివ్వవద్దుసుమా. నిన్ను అపేక్షించే ఆఖరుసేవ యిదే" అని కోరాడు.

"తమ ఆజ్ఞను ప్రాణాలు అర్పించియైనా అక్షరాలా పాలించి తీరుతాను." అని యజమానికి మాటయిచ్చాను. నామాటలు విన్న తర్వాత యజమాని అయిదు వేల రూపాయల సంచి నాకిస్తూ "ఈసంచి తీసుకో. దీనిని నేను సంతోషంగా యిస్తున్నాను" అని అన్నాడు. నేనది తీసుకోలేదు. వద్దన్నాను. కాని యజమాని "నీవిది తీసుకొనకపోతే నాకు చాల దుఃఖం కల్గుతుంది" అని బలవంత పెట్టాడు. బలవంతంమీాద విధిలేక ఆసంచిని తీసుకున్నాను. నాల్గు గంటలు గడిచినవో లేదో యజమాని అసువులు వొదిలాడు. ఆయన కుమారునకు ఆయన చనిపోవుటకు మూడు గంటలకు ముందే తంతినిచ్చాను. చనిపోయిన అయిదు గంటలకు కుమారుడు మైనపురి చేరాడు. యజమాని రాత్రి తొమ్మిది గంటలకు కాలధర్మమొందాడు. కుమారుడు రాత్రి రెండు గంటల సుమారులో వచ్చాడు. యజమాని చనిపోయిన పిమ్మట యజమానురాలు "కొట్టు తాళపు చేతులు తనకివ్వ"మని అడిగింది. నేను "తాళపు చేతులు శివచరణలాల్‌గారికే యిస్తాను. యజమాని యాజ్ఞాపించింది ఇదే. వారికే యిస్తాను. ఇంకొకరికి ఇవ్వను" అని చెప్పాను. ఆమె "ఓరి పిచ్చివాడా, తాళపు చేతులు ఈవిధంగా చేస్తే నీవు పొందేది ఏముంది? కొట్టుతాళం తీసి డబ్బు లాటువేసుకో, నాకేమీా యివ్వవద్దు. అంతా నువ్వేతీసుకో, నేనూ నీతోటే ఉంటాను. నీవెక్కడికి వెళ్లితావో నేనూ అక్కడికే వస్తాను" అన్నది. నేను "ఈ పని నావల్లకాదు. నేను నిన్నెక్కడికి తీసుకుపోయి ఉంచుతాను? అదిన్నీగాక నీవు నన్ను పుత్రునితో సమానంగా భావించుకొన్నటువంటి యజమాని భార్యవు. నాకు తల్లివంటి దానవు. నిన్ను నాభార్యగా స్వీకరించే శక్తి నాలో లేదు. క్షమించు" అని చెప్పాను.

బాబుగారూ! ఆమె ఎంతో బ్రతిమాలింది, నచ్చచెప్పింది, స్త్రీ సహజంగా ఏడ్చింది. నమస్కారం చేసింది. నేనుమాత్రం ఆమె మాటలలో నొక్కదానినీ చెవినిబెట్టలేదు. చివరకు ఏయుపాయము కానక తనమరదిని — మేమెవరినైతే యింటికి రానివ్వకుండా చేశామో - పిలిపించింది. ఆయన వచ్చీ రావడంతోటే తనఠీవిని, దర్పాన్ని ప్రదర్శించాడు. నన్ను పోలీసులకు వప్పగించుతానని బెదురుపెట్టాడు. ఆయన బడాయికిగాని, బెదరింపులకు గాని నేనుమాత్రం జంకలేదు. తాళం పగలగొట్టుటకు సిద్ధపడ్డాడు. నేను కొట్టు దర్వాజా ముందు లాఠీఒకటి చేతబుచ్చుకొని కూర్చున్నాను. "తాళం పగలగొట్టుటకు వచ్చినవాని సిరస్సు ఒక్కవేటుకు పగలకొడతాను. ఆతర్వాత జరిగేదేదో చూచుకుంటా" నని అతనితో నిర్భయంగా చెప్పాను. దానితో అతడు సాహసించలేక పోయాడు. ఈ పోట్లాటతో రాత్రి రెండు గంటలైంది. యజమాని కుమారుడు శివచరణలాల్ వచ్చాడు. తాళపుచేతులు ఆయనకిచ్చి వేశాను. పరిస్థితి అంతా వివరంగా చెప్పాను.

అయ్యా! కొట్టుతలుపులు తెరిచి చూస్తే దానిలో డెబ్బదివేల రూపాయల రొఖ్ఖం ఉంది. ఈ సొత్తు సంగతి యజమానికి తప్ప యింకెవరికీ తెలియదు. నేను యజమానురాలి మాట మన్నించి ఇరవై, ఇరవైయైదువేల రూపాయలు తీసుకుంటే ఎవరికీ సందేహం, అనుమానం కల్గేదికాదు. కాని నామనస్సులో ఈ దుర్బుద్ధి పుట్టలేదు. ఇందుకుకారణం లేక పోలేదు. మాఅమ్మ నిత్యమూ రామాయణం పారాయణచేసి చెబుతూ వుండేది. ఆమె నాకు నిత్యమూ బాబూ, "మోసము, పాపము, ఎన్నడూ చేయవద్దు. ఈరెంటికీ దూరంగా వుంటే నీకు కష్టములు, దుఃఖములు కలుగవు" అని బోధిస్తూ ఉండేది. ఆమె ఉపదేశాలు నామనస్సులో నాటుకుపోయినై. అందువల్ల నేనీ పాపకార్యానికి ఒడిగట్టలేదు. నేచేసేపనికి శివచరణలాల్ ప్రసన్నుడైనాడు. నాకు ఒక వెయ్యిరూపాయలు ఇచ్చాడు. ఇస్తూ - నువ్వు "నాదగ్గరనేఉండు" అని అన్నాడు. యజమాని మరణమొందినప్పుడు నాకు కల్గిన అనుభవాన్ని పురస్కరించుకొని అక్కడ ఉండుట భావ్యమని తోచలేదు. యజమాని క్రియాకర్మలు సంపూర్ణమైన తరువాత పదమూడోరోజున నేను నౌకరీ మానివేశాను. నాకు లభ్యమైన ఆరువేల రూపాయలలో రెండువేల రూపాయలతో నాచెల్లెలి వివాహం చేశాను. రెండువేల రూపాయలతో నేను వివాహం చేసుకున్నాను. ఒకవెయ్యి రూపాయలు నిల్వయుంచుకొని, మిగిలిన వెయ్యి రూపాయలతో ఒక దుకాణంపెట్టాను. ఈసారికూడ వ్యాపారంలో నష్టమేవచ్చింది. అంతటితో నేను మైనపురీ వదలివేశాను. ఇక్కడకు చేరుకున్నాను. నౌకరీ చెయ్యాలనే ఉద్దేశ్యంలేదు. అందుచేత గుఱ్ఱాన్ని, బండిని కొన్నాను. బాడుగకు తోలటం ప్రారంభించాను. అప్పటినుంచీ ఈపనిచేస్తున్నాను. ఇలాగే నాజీవితం ఆనందంగా గడచి పోతూఉంది. నేనొకరికి ఒకకానీ అప్పులేదు,

నాకింకొకరు ఒకకానీ యివ్వనక్కరలేదు. నాకథంతా విన్నారు. ఇక తమరే శెలవివ్వండి - బండిలోనుండి దిగివెళ్లిన బాబుగారు నాల్గణాల కోసం నేనుమోసం చేస్తానన్నాడు. అటువంటి వ్యక్తికి నేనేమి జవాబు చెప్పగలను? ఇదాలోకం. ప్రజలా కాకుల వంటివాళ్లు. ఎవరిఇష్టం వచ్చినట్లు వాళ్లు అంటూనే ఉంటారు. నేనూ అందరిమాటలూ వింటూవుంటాను. జట్కావాళ్లకు మర్యాదలేదు. అందుచేత నేనూ యెవరు యేమన్నా వింటూ వుంటాను.

శ్యామలాలు కథంతా విని నేను నిశ్చేష్టుడనైపోయాను. పిమ్మట నేను "సోదరా! నువ్వు మహత్తరమైన వ్యక్తివి. ఋషివంటివాడవు; వందనీయుడవు. నిన్ను దర్శించినవారు తరిస్తారు. నీపాదాలను స్పృశించాలని నా ఆత్మ అభిలషిస్తూ వుంది" అన్నాను.

శ్యామలాలు చిరునవ్వు నవ్వుతూ "బాబూ! నాకు లేనిపోని గొప్పదనాన్నేదో ఆపాదిస్తున్నారు, కాని తమరు వర్ణించిన గొప్పదనము, మహత్తు నాలో లేనేలేదు. నాపాదాలేమిటి తమరు తాకటం మేమిటి? రామ! రామ! నేనేమైనా సాధువునా, ఋషినా?" అని అన్నాడు.

నేను "సాధువులంటే ఎట్లావుంటారు? కాషాయ బట్టలు కట్టినవారే సాధువులా? వారు కేవలం బూటకపు సాధువులు. నీవంటివాడే నిజమైన సాధువు, సత్పురుషుడు" అని అనగానే శ్యామలాలు నవ్వుల వర్షం కురిపించాడు. ఇంతలో గంగాపూర్ గ్రామం వచ్చింది. బండిదిగి మేము మానిర్ణీత స్థలమునకు వెళ్లాము.

దారిలో నేను మనోహర్‌లాల్‌తో "ఈప్రపంచంలో ఎంతోమంది రత్నముల వంటివారు కసువులోని కండిగింజవలె దాగి ఉన్నారు. వారి నెవరూ గుర్తించలేరు" అని అన్నాను.

మనోహర్‌లాల్ "అవునవును. గొప్పగొప్ప పేర్లు పెట్టుకొని మోసంచేసే సాధువులు ఈశ్వరునివలె పూజింప బడుతున్నారు. ఇటువంటి సత్పురుషులను సంఘం ఏమాత్రం గుర్తించటంలేదు" అన్నాడు.



ఇది జరిగి చాలా కాలం అయింది. వందనీయుడు, పూజనీయుడు శ్యామలాల్ ఇంకా బ్రతికి వున్నాడో లేడో తెలియదు. కాని అతను ఎప్పుడు జ్ఞాపకం వచ్చినా అతని కల్పిత మూర్తికి నా ఆత్మ నమోవాకాలర్పిస్తుంది.

——(:o:)——

# రూపాయి ఆత్మకథ

శ్రీమతి ఇంకొల్లు రంగనాయకమ్మ

నేనెవరో మీకు తెలుసా? నేను మీ అందరికి ప్రేమ పాత్రుడను. కనుక నా జీవితమును గూర్చి మీ అందరికి చెప్పుతా వినండి.

నేను మొదట అమెరికాలో మెక్సికో ప్రాంతపు ఒకగనిలో వున్నాను. నేను యీ ప్రపంచములో స్త్రీరూపములో వుద్భవించితిని. కాని భగవంతుడు నాయందు దయయుంచి నన్ను పురుషునిగా మార్పించినాడు. ఇది నాకెంతయో సంతోషకరము. భగవంతుని సృష్టిలో పురుషరూపమును స్త్రీ రూపముగను, స్త్రీరూపమును పురుషరూపముగను మారుట ఎవరైన చూడగలిగితిమా? లేదు కాని నా కటువంటి మహద్భాగ్యము కలిగినది. ఇందువలననే నాకెంతో ఆనందము.

గనిలో నేను నాసహోదరులైన తగరము, సీసము మొదలగువాటితో కలసి మెలసి యుంటిని. అప్పుడు నేను నల్లగా వుండేదానిని. మేమప్పుడు మాతల్లి ఒడిలో వొదిగి వుండుటచేత మాకు చాల సుఖముగా వుండెడిది. తల్లివొడిలోవున్న ఎవరికి సుఖముగా నుండదు? అటువంటి సుఖమునుండి వేరు పడవలసిన దినములు వచ్చినవి.

ఒకరోజు ఆకస్మాత్తుగా కూలీల ఇనుప గునపమునకు తగిలితిని. ఇంకేమున్నది. వారు నన్ను త్రవ్వి బయటకు దీసిరి. అలా త్రవ్వి బయటకు తీసిననన్ను మండుచున్న అగ్నిలో పడవైచిరి. అబ్బా బాధ చెప్పనలవిగాదు. నన్నుచూచి నా సహోదరులు ఎంతో బాధపడిరి కాని ప్రయోజనము? జ్వాలమూర్తి అగ్ని నాశరీరమును కరుగవైచెను. కాని మరల అగ్నినుండి బయటకుతీసి చల్లని నీటిలో ముంచుటవలన ఆచల్లదనమునకు నేను ఒక ముద్దరూపములో తయారై "రజితము" అని పేరుపొందితిని.

ఇప్పుడు నన్ను భారత దేశమునకు పంపిరి. భారతదేశపు సర్కారువారు నన్నుకొని నాణ్య రూపములో నన్ను తయారు చేయుటకుగాను మూసలలో పోయించిరి. మరల యింకొకసారి అగ్నియొక్క మంటలకు గురికావలసి వచ్చినది. ఆవిధముగ నన్ను మూసలలో పోసి, రూపాయి, అర్ధరూపాయి మొదలగు నాణ్యములుగా తయారుచేసిరి. ఇప్పుడే నా స్త్రీత్వముపోయి పురుషత్వము ప్రాప్తించినది. ఈనాణ్య రూపముగా యీభారతదేశమందే కాక, యితర దేశములందు గూడ నా పేరు ఖ్యాతిగాంచినది.

రూపాయిపేరుతో ఒకసారి మద్రాసు వెళ్లితే, మరొకసారి విజయవాడ, మరొకసారి డిల్లీ, వేరొక సారి కలకత్తా. ఇదియంతయు ఎందుకు - నేను భారత దేశములో తిరుగని ప్రదేశమేలేదు. దేశాటనము చేయుటవలన నాకు ఎంతో ఆనందము కలిగినది. ఈప్రకృతి ఎంత రమణీయము!

సాధారణముగా నాయొక్క నివాసస్థానము బ్యాంకులు, శ్రీమంతుల ధనగారములలోను, మనీపర్సుల లోను, గ్రామీణుల జేబులలోను గృహిణుల పోపుపెట్టెలలోను. ఒకచోటేమి, అంతటనూ నేనే. ఒకసారి నేను ఒక పెద్ద ఆపత్తు పాలైపోతిని. బహుశ అవి నా చెడురోజులేమో. ఖర్మము చాలక, ఒక (పిసినారి) అంటె పిసినిగొట్టు చేతులలోపడితిని. ఆ మహాశయుడు నన్ను భూమిలో పాతిపెట్టెను. ఇంకేమున్నది?

అక్కడ నా అవస్థచెప్పలేను. ఎటువైపుచూచినను అంధకారమే. గాలి అసలేలేదు. భూమిలోని తడివలన నా ముఖము నల్లబడి పోయినది. ముఖమేమి ఖర్మము? నా శరీరమంతాకూడాను. ప్రకృతినంతయు తిలకించుచు ఆనందముతో నుండు నేను అంతటి దురవస్థపాలైపోతిని. అప్పుడు నిజంగా నేను ఏడ్వని దినమేలేదు. ఎప్పుడు నేను మరల బయిటకువచ్చి సుఖముగా వుందునా యని, కాని ఆ విధముగా 20, 30 సంవత్సరములు వుండిపోతిని. అబ్బా! యిప్పటికి నా అదృష్టము పండినది. లేకపోతే నేను ఏడ్వగా ఏడ్వగా ఆభగవంతుడు నాయందు కనికరించి రక్షించవలెనని తలచెనేమో, ఎవరెరుగుదురు! అకస్మాత్తుగా ఒకరోజున ఒక దొంగ నేనువున్న స్థలమంతయు త్రవ్వి నన్ను బయటకు తీసెను. ఇంతటితో నాకష్టము తీరేనని అనుకొంటిని. ఇంతలో వాడు నన్నో హోటలువానికిచ్చి కాఫీ వగైరా త్రాగెను. హోటలు యజమాని నన్ను చిల్లర సోదరులతోపాటు నన్ను గూడ ఒకపెట్టెలో పడవైచెను. కాని అచ్చటనుండి కొద్దిరోజులలోనే బయటకు రాగలిగితిని. అప్పటినుండి నాకు ఎటువంటి ఆపత్తియూలేదు. నేను తిరుగని ప్రదేశమేలేదు. నేను చేసిన యాత్రలవలన నాకుకలిగిన అనుభవము ఎంతైననుకలదు. నేను వెళ్లని చోటేలేదు. నేను చూడని మనిషేలేదు. ఎవరు నన్నుచూచి ఆనందింపరు? ఎవ్వరికి నన్నుచూచి ఆశకలుగదు? ఇప్పుడు నేను ఒక బీదముసలి అవ్వవద్ద నున్నాను. ఆమె ఏకైక పుత్రుడను నేనే. ఆమె పంచప్రాణముల సైతము నేనే. ఆమెయొక్క సర్వస్వము నేనే. ఆమె నన్నెంతో ప్రేమతో చూచుకొనుచున్నది.

నేను ఎంతటి మహిమ కలవాడిని! ప్రపంచమున కంతటికి సుఖము, ఆనందము కలుగజేయువాడను నేను. చనిపోయేవాడిని బ్రతికించగలశక్తి నాలోనున్నది. ఆకలిగలవానికి అన్నము, బట్టలు లేనివానికి బట్ట ఏది ఎవరికి కావలయునో అది యంతయు యీడేర్చగలశక్తి నాలోనున్నది. రాజును గరీబుగాను, పేదను నవాబుగను చేయగలశక్తి నాలోకలదు. మానవునికి ప్రతిష్ట కలిగింపచేయుకల వాడినికూడ నేనే. నిజంగా చెప్పదలచుకుంటే యీప్రపంచమంతాకూడా నామీద ఆధారపడవలసినదే. ఇందుచేతనే "ధనమూలం మిదం జగత్" అని అన్నారు పెద్దలు. నన్ను పొందుట కొరకుగాను యీ మానవులు ఏమి చేయకుండానున్నారు? ప్రతివారికిని నాయందు ఆశయే. చదువుకొనుట నాకొరకేగదా? కష్టపడి పరిశ్రమచేయుట నాకొరకేగదా! దొంగతనము కాని, అబద్ధమాడుటగాని నన్నుపొందుటకేగాదా! ఒక్కొక్కరు నాకొరకు తమప్రాణముల్సైతము పోగొట్టుకొనుటకు సంసిద్ధులౌతారు. నేను మానవుని సర్వస్వమును. ఆహాహా! యీ ప్రపంచములో నాతోసమానులు ఎవ్వరునూలేరుగదా. అందరు నన్ను ఎంతో ప్రేమతో పూజించు చుందురుగదా! నేను ధన్యజీవిని!

—o—

# మహిళాభ్యుదయము

జంషెడ్‌పూరు నందలి ఆంధ్రనారీమణులు మహిళాభ్యుదయమునకు కృషిచేయు నుద్దేశముతో ది 7-6-51 న సమావేశమయి రాష్ట్రసంఘమును స్థాపించిరి. శ్రీమతి నాగమ్మస్వామిగారు అధ్యక్షత వహించారు. స్థానిక ఆంధ్రస్త్రీల వివిధసమస్యలను చర్చించినపిదప జరిగిన కార్యవర్గం ఎన్నికలలో శ్రీమతులు నాగమ్మస్వామి, కె. యల్. సుందరి, రాజం నాయుడుగారలు అధ్యక్ష, కార్యదర్శి, కోశాధికారులుగా ఎన్నుకోబడిరి. ది 14-6-51 న జరిగిన ద్వితీయ సాధారణ సమావేశములో శ్రీమతి నాగమ్మస్వామిగారి అధ్యక్షతన కుట్టుపని తరగతులు ప్రారంభించుటకును, విరివిగా సభ్యులనుచేర్చి సమావేశములను తరచుగా ఏర్పాటుచేయుటకును తీర్మానించబడెను.

♦ ♦ ♦

అశోక్ విహార్‌లో అసిస్టెంటు డైరెక్టరుగా పనిచేయుచున్న డాక్టరు యం. లక్ష్మిగారిని ఉన్నత విద్యాభ్యాసమునకు యితర దేశములకు పంపుటకుగాను మద్రాసు కార్పొరేషనువారు చేసిన ప్రతిపాదనను మద్రాసు ప్రభుత్వమువారు ఆమోదించిరి. !ప్రపంచ ఆరోగ్య సంస్థవారి ఉచితవేతనముపొంది యీమె విదేశాలలో విద్యనభ్యసించే కాలములోకూడ ఆమె డ్యూటీలోనే యున్నట్లు పరిగణించబడును. కావలసినదుస్తులు, వగైరాలను సమకూర్చుకోడానికి ఆమెకు రు 1000 లను కార్పొరేషను యివ్వడానికి కూడ ప్రభుత్వం ఆమోదించింది.

♦ ♦ ♦

ఇండియా ప్రభుత్వమువారిచ్చిన విద్యావేతనముతో శ్రీమతి దాసు వెంకట సీతాబాయిగారు విద్యుత్కణ శాస్త్రములో నూతన పరిశోధనలు చేయుటకుగాను కెనడాదేశం వెళ్లారు. ఈమె బెజవాడ వాస్తవ్యులైన శ్రీ దాసుపద్మనాభరావుగారి కుమార్తె; ఆంధ్ర విశ్వవిద్యాలయంలో యం. యస్. సి. పరీక్షలో ఫస్టుక్లాసులో ఉత్తీర్ణురాలైనది.



# జాతర

మిడి మిడి ఎండలు ముగిసినవి.
వడి వడి గాలులు వీచినవి.
పుట్టి దుమ్ములు మాసు ఆకులు
పట్టి చోట్లలో పడిగ పారగ
పెద్ద మొబ్బులు పట్టుపట్టి
పరుధ చప్పుడు చేస్తు లేవగ
మెఱుపు ఉరుములు ముందంజవేయుచు
కారు మొబ్బులు ఆకాశం నిండగ
ఊరిలోని వారంత గృహము చేరి
పొలములోనివారు పరుగు పట్టె
గేదలు పశువులు గంతులు వేసె
కాకులు పిట్టలు గూళ్లు చేరి
కప్పలన్ని కమ్మగ కేకలువేసె.
దినము వారము దిక్కుదిశ
అన్నాహారము అన్ని మాని
అంతులేని మొబ్బు వీటిని
వాళావలిగ వాన వసువు
వడివడిగ వసుధ చేరె
కష్టనష్టములు కలిగిన కర్షకులు
పస్తుండిన బిడ్డ తల్లులు
మేతలేని మంద పశువులు
ఎండిపోయిన చెట్లరాసులు
పండిపోయిన పచ్చిక బయళ్లు
కమిలి పోయిన కమ్మని తీగలు
సర్వంబొకటిగ సంతసించగ
గ్రామంలోని కర్షకులంత
చావడి అరుగున బసచేరి
గ్రామంలోని గ్రామదేవికి
ఊరివారికి ఉత్సవాలన్నారు,
అంత ఇంత అందరు చేరి
చందాలు వేసి కొన్నారు
పండ్లు పూలు పట్టుకొనివచ్చి
కుంకుమ పసుపుతో
గుడివద్ద గుంపుచేరగ
అందులో కొందరు అందమైన
జీవాలను దేవికి ఇవ్వాలన్నారు.
మరికొందరు పాపాలన్నారు;
జీవహింస "వద్ద"ని కొందరు
"కావాలని" మరికొందరు
గట్టిగ పట్టు పట్టిరి.
పెద్దకఱ్ఱలు పట్టుకొనివచ్చి
నిడుపాటి కత్తులను నీటుగపట్టి
పోరాటంలో పూనుకొని
ఒకరిని నొకరు కొట్టుకొనగ
ఎఱ్ఱని నెత్తురు వీధినింపుచు
రక్త గాంద్రము కోపంమించెను.
వీధిలోని పడుచు యొకతె
వారిని వీరిని విచారించె.
సంగతిని మనసున సేకరించి
జగడం వేసె జనుల యొద్దకు
పరుగున పోయి నిలచి
అక్కడ ముందు వారియెదుట
కత్తియెత్తి చక్కగ పట్టగ
జగడాలవారు జంకుబడి,
జాడగ జరిగి నిలువబడంగ
కత్తిపట్టిన పడతి అప్పుడు
"నేను అమ్మవారు మీకు తెలుసా!
ఎండిపోయిన ఎద్దు వద్దు
బలసిన బర్రె వద్దు
మేతలేని మేక వద్దు

నాకు వచ్చిందిస్తారా ?"
అట్లు ఆశ్చర్యంతో అడగంగ
పెద్దలంత భయపడిలేచి
"ఇస్తామని" ఇంపుగ చెప్పారు.
అందరి ఇండ్లలో ఆడుతుండే
అందమైన అందరి పాపలను
అడిగింది అమ్మ ఆకలితోను
దీనిని విన్న ధీరులందరు
చేతులను రొమ్మున చేర్చి
దేవిముందర దండాలు పెట్టి
పాపలనిచ్చి బతకలేమని
మొరపెట్టి మొత్తుకొన్నారు
"పాపలకుండే ప్రాణాలు
ప్రాణంపైయుండే ప్రేమలు
ప్రాణులకెల్ల పెట్టబడెను.
మీకుండె మంచి మనసు
జీవించె జంతుకోటికి
తప్పక చక్కగ యున్నది.
జీవించే జీవాలను
దీక్షపూని దేవిగారికి
ఆశతో అర్పింపవద్దు,
పొలాలంత పండించి
కూరకాయలు మీరుకుడిచి
అమ్మకు ఆకలి తీర్చండి"
అని పలుకుచు ఆవనిత
జనులను శాంతపరుప
అందరు ఆమెకు దండాలుపెట్టి
కమ్మని వస్తువులు కానుక పెట్టగ
దీవనలొసగి ఆమె దారినసాగగ
గ్రామవాసు లొకటిగ కలసి
జంతువులేని జాతరచేసి
కష్టనష్టాలు కలుగవద్దని
దీక్షతో దేవిని వేడుకొని
కులాసాగ గుడినివీడి
ఇంపైన పలుకులతో
ఇల్లుచేరిరి.

గౌరవరం వెం. రమణ.





## కొబ్బరి పులావు.

1 శేరు బియ్యం, కొబ్బరికాయలు 3, నెయ్యి $\frac{1}{4}$ శే, నీరుల్లిపాయలు $\frac{1}{2}$, వెల్లుల్లిపాయలు $\frac{1}{8}$ శే, అల్లం $\frac{1}{8}$ శే, ఉప్పు 1 పిడికెడు, లవంగాలు 1 తు, ఏలకులు 1 తు, దాక్షిణచెక్క 1 తు, లవంగాకు కొంచెము, నీళ్లు 2 శేర్లు. నీరుల్లి, వెల్లుల్లి, అల్లం, ఈ మూడువస్తువులు వేరు వేరుగా, చితుకగొట్టవలెను. తరువాత మసాలా సామానులన్నియు వేరు వేరుగా మెత్తగా గాకుండా (పొడిగా) చితుకగొట్టవలెను. కొబ్బరి కాయలు తురిమి, 3 శేర్లు నీళ్లు వేడిచేసి అందులో ఈ తురుమువేసి కొబ్బరిపాలు తీయవలెను.

చేయువిధానము:- పొయ్యిమీద పాత్రనుపెట్టి, ముందు లవంగాలు, దాక్షిణచెక్క, లవంగాకువేసి, తరువాత నీరుల్లిముద్ద, వెల్లుల్లిముద్ద, అల్లం, వేసి వేగనిచ్చి బియ్యము పోయవలెను. 2 నిమిషములు వేగనిచ్చి తరువాత కొబ్బరిపాలు పోయవలెను. ఉప్పుకూడ వేయవలెను. అన్నం ఉడుకుతూ యున్నప్పుడు ఏలకుపొడివేసి క్రింద నిప్పులుతీసి పైనపెట్టవలెను. ఇదిచాలా రుచికరముగా నుండును.

## బంగాళాదుంపలు పులావు

1 శేరు, బియ్యం, బంగళాదుంపలు $\frac{1}{2}$ శే, నెయ్యి $\frac{1}{4}$ శే, ఉల్లిపాయలు $\frac{1}{2}$ శే, వెల్లుల్లి $\frac{1}{4}$ శే, అల్లం 1/8 శే, నీళ్లు 2 శే, ఏలకులు 1 తు, లవంగాలు 1 తు. దాక్షిణచెక్క 1 తు, లవంగాకు కొంచెము, గసగసాలు 2 టేబిల్ స్పూన్స్, లవంగాలు, ఏలకులు, దాక్షిణచెక్క, ఇవికొద్దిగా తీసియుంచి అన్నికలిపి ముద్దనూరవలయును. నీరుల్లి, వెల్లుల్లి, అల్లం, వేరు వేరుగా ముద్దలు నూరవలయును. ఈ మసాలా సామాను లన్నింటిలోను కొద్దికొద్దిగా తీసి, దుంపలు ఉడికించి, తొక్కలుతీసి ముక్కలుగా తరుగవలయును. అవి ఈ మసాలాలువేసి నేతిలో దోరగా వేగనియ్యవలెను.

చేయు విధానము:- పొయ్యిమీద పాత్రనుయుంచి నెయ్యిపోసి వేరు వేరుగా, యుంచిన లవంగములు ఏలకులు, దాక్షిణచెక్క వేయవలెను. తరువాత, నీరుల్లి, వెల్లుల్లి, అల్లం ముద్దలువేసి వేగనిచ్చి మసాలా ముద్దలు వేయవలెను. ఇవన్నియు కలిసి దోరగా వేగినతరువాత బియ్యముపోసి 2 నిమిషములు వేగనిచ్చి నీళ్లు పోయవలెను. ఉప్పు ఒక పిడికెడు వేయవలెను. అన్నము ఉడుకుతూ యున్నపుడు నిప్పులుతీసి మీద యుంచవలెను.

కామాడ అమ్మాజీ దేవి.

## ఆనపకాయి వేపుడు

లేత ఆనపకాయి తొక్కతీసి, ఒక అంగుళము వెడల్పు, $2\frac{1}{2}$ అంగుళాలపొడుగు ముక్కలక్రింద తరుక్కోవాలి. బూర్లెమూకుట్లో నువ్వులనూనె పోసి బాగా కాగిన తరువాత ఆనపకాయి ముక్కలువేసి ఎర్రగా వేగేవరకు వేయించి ఎండుమిరపకాయలు, సెనగపప్పు, ఎండుకొబ్బరి కొంచము జీలకర్ర వేయించి సరిపడ్డ ఉప్పు, పసుపువేసి పొడుముకొట్టి వేయించిన ఆనపకాయి ముక్కల్లోవేసి 10 నిమిషాలు బాగాకలిపి దించాలి.

వాడ్రేవు సీతమ్మ

—o—

# బ్రతుకు తెరువు

———(o)———

## ఆహారం—కరువు

ఇప్పుడు బియ్యం ప్రజలకు ఏమాత్రం అందుబాటులోనున్నదో మనము చూచుచునే యున్నాము. అందుకు కారణములు ఏవయినా ప్రకటించబడియుండవచ్చును. బియ్యం రేషను పరిమాణం మాత్రం 6 ఔన్సులకు తగ్గించబడింది.

ఈ పరిస్థితులలోకూడ ప్రజలు బియ్యంకొరకే ఎగపడడంవలనను, బియ్యం కరువుకుగల కారణాలను విమర్శనాదృష్టితో పరిశీలించుటవలనను తక్షణ సమస్యమైన ఆకలి బాధ పరిష్కారంకాదు. ఈ సమస్యా పరిష్కారానికిగల అవకాశములనైనను వినియోగించుకొనుటకంటె గత్యంతరము మరేముంటుంది? ప్రస్తుతము లభించే గోధుముల రేషను మూలంగా వాటి వాడకమున కలవాటుపడితిమి. గోధుములను నూకలుగాను, రవ్వగాను, పిండిగాను చేయించుకొని అన్నముగాను, ఉప్మాగాను, రొట్టెలుగాను, పూరీలుగాను, దోశలుగాను తయారుచేసుకొని తింటున్నాము. వీనితోబాటు చిలకడ దుంపలను అనేక విధములుగా ఆహారంగా నుపయోగించవచ్చును.

చిలకడ దుంపలు తియ్యగా రుచికరముగానుండును. మనయిండ్లలో ఈ దుంపలను నిప్పులలో కాల్చుకొని తినుటకూడ కలదు. మంచి పుష్టికరమైన ఆహారము. ఈ దుంపలను ముక్కలుగాతరిగి ఉడకబెట్టి ఉప్పు కారము అద్దుకొని తినవచ్చును. కూరగా వండుకొని అన్నములోను, రొట్టెలలోను, విశేషముగా వాడవచ్చును. చిలకడ దుంపల ముక్కలువేసి పులుసుకూడ పెట్టుదురు.

కర్రపెండలమునుకూడ కూరగా వండుకొని వాడుకొనవచ్చును. ఇది విలువయైనట్టి ఆరోగ్యకరమైనట్టి ఆహారము.

మనము వేరుశెనగ పప్పులను ఆహారముగా భుజించముకాని చిరుతిండిగా వాడుకలోనున్నవి. కాయలను వేయించి పప్పులను తింటారు. పప్పులను బెల్లముగాని, చక్కెరగాని పాకముపట్టి తింటారు. ఈ పప్పులు తినగానే కొద్దిగా బెల్లముగాని, చక్కెరగాని తినడం మంచిదంటారు పెద్దలు. వేరుశెనగపప్పు ఆహారమున కలవాటు పడినవారికి ఆరోగ్యానికి ఎట్టిభంగముండదు. వానితోబాటు పాలుపండ్లనుకూడ భుజింపనగును.

ఈ సమయంలో ఆకుకూరలను, పొట్ల, సొర, బీర, దోసకాయలనుకూడ అనేక రకములుగా ఆహారముగా నుపయోగించనగును.

పొట్ల, సొర, బీర, దోసకాయలను వండకుండా సయితము ఆహారముగా నుపయోగించవచ్చును. రుచికరముగానుండును. కూరగాను, పప్పులో వేసి ఆకు కూరలతో బాటు భుజింపవచ్చును. 'బియ్యం చాలినన్ని లేమివలన ఏర్పడినలోటును కూరగాయలు, దుంపల మూలంగా తీర్చుకొననగును.

వెలగపండ్లను మనయింట్ల పచ్చడి నూరుదురు. పండ్లను పగలగొట్టి గుజ్జుతో చక్కెరకలిపి తినవచ్చును.

అట్లే టమాటో పండ్లను ముక్కలుగాతరిగి చక్కెరలో కలుపుకొని తినవచ్చును. మంచిరుచికరమైనట్టియు, ఆరోగ్యవంతమైన ఆహారము.

పనసకాయలుకూడా మంచి ఆహారము. పండ్లనువలచి తొనలను తినవచ్చును. అవి మధురముగాను, రుచికరముగా నుండును. విత్తనములను పులుసులో వేసుకొనియు, వేయించుకొని ఉప్పు కారము చల్లుకొని తినవచ్చును. పచ్చికాయయందలి తొనలను కూరగాను, పరుగులుగాను తయారుచేసికొని తినవచ్చును.

మనకు సాధారణముగా లభించు కొబ్బరికాయలుకూడ మంచి విలువనైన ఆహారమునుకలవి. కొబ్బరి చాల శ్రేష్టమైనది. కాబట్టియే అపక్వాహారమున కలవాటు పడినవారు కాయగూరలతో బాటు కొబ్బరికి ప్రాధాన్య మెక్కువగా నిత్తురు. దక్షిణాదిన ముఖ్యంగా మలయాళ ప్రాంత్యమున ఆహార పదార్థములలో కొబ్బరిని విశేషముగా వాడెదరు. మనప్రాంత్యములలో నూనె, నెయ్యి వాడకములకంటెకూడ మలయాళ ప్రాంత్యములలో కొబ్బరి నూనె విశేషముగా ఆహారపదార్థముల తయారుకు, తల నూనెగా వాడకమునకు, దేహమర్దనకు ఉపయోగములోనున్నది.

బెంగాలులో కరువు రోజులలో ఏర్పడిన పరిస్థితులు మరెప్పుడు ఎచ్చటను ఏర్పడగూడదని గ్రహించి దొరికే కొద్ది బియ్యంతోటి పై ఆహార పదార్థములను సమన్వయము చేసుకొని బ్రతుకుటకంటె దారి కనిపించుటలేదు.

చివుకుల లక్ష్మీకాంతమ్మ

# చిత్రాంగి

శ్రీ ఎ. వి. ఇ. యల్. సత్యనారాయణరావు

పాత్రలు:

సారంగధరుడు — చిత్రాంగి

చెలికాడు — చెలి

కొందరు మిత్రులు

[రంగము - సారంగధరుడు, మిత్రులు పావురాలను ఎగురవేస్తుంటారు. పావురాలు ఎగురుతూన్నట్టు రెక్కల చప్పుడు - ఈలల శబ్దాలు:]

ఒక మిత్రుడు:- అదుగో, అదుగో! ఆ తెల్ల పావురంచూడు. సుడిగాలిలో పోతున్నాది. (ఈలవేస్తూ) అయ్యో! పట్టి కొట్టి జారిపోతున్న దే.

మరొకడు:- లేదు, లేదు, మళ్లీ రెండు పావురాలు పైకిపోతున్నాయిచూడు. ఎంత వింతగా ఎగిరిపోతున్నాయో! అదుగో, అటు అటుచూడు.

ఒకమిత్రుడు:- ఏదీ? ఎక్కడ? ఆకాశంలో వీకమైపోయినట్టుందే. నాకెక్కడా కనుపించే లేదు.

మరొకడు:- అయ్యోపాపం! నల్లపావురము ఎంచేతో అట్టే పైకిపోలేక తిరిగి తిరిగి తల్లక్రిందులై జారిపోతున్నట్టుగానుంది.

ఒకడు: లేదు దానికి భయం కగిలినట్టుంది. అంచేత పాపం తిరిగిపోయింది.

[కొంచెం నిశ్శబ్దం]

సారంగధరుడు: చెలికాడా! నీవు ఎగురవేసిన పావురం ఎంతో పైకి పోలేదే, మిన్నంటి తారకా సందోహాన్ని తాకి వస్తుందన్న సవాలు ఏమైంది? పందెం నాకే దక్కింది. ఏమంటావు?

చెలికాడు:- సారంగధరా! నీవన్నది నిజమే. సవాలు పోయింది. కాని ఆవిధంగా జరగడానికి కారణం లేకపోలేదుసుమా! రెక్కలల్లార్చి పయనం మొదలు పెట్టగానే పిడుగువలె డేగవచ్చి భయం గొల్పితే ప్రాణ సంరక్షణార్థం తిరోగమించింది.

సా:- ఏదో సాకు చెబుతావులే! పోనీ మళ్లీ పందెంవేసి పావురాన్ని విడుస్తావా? ఎందుకూ - ఉత్సాహం కలిగేటట్టు ఎంత దోహదం చేసినా ప్రయోజనం ఉంటే కదా!

చె:- ఔను, ఈ దినం నీవేమన్నా చెల్లును. కనుకనే నాపందెం వ్యర్థం అవుతున్నది. పోనీ నీపావురాన్ని ఎగుర వెయ్యి, చూద్దాం ఎంతపైకి పోతుందో, ఏవిను వీధినిపయనం సాగిస్తుందో గాలిపటంలా, ఏవాయు పథంలో ఊగులాడుతుందో,

నీమనస్సుకు ఆశ్చర్యం గొలిపే ఏ అనంత వాతావరణంలోకి దూసుకు పోతుందో!

సా:- ఎంత వింతగా వర్ణన చేశావు! అయితే నీకేమైనా అనుమానం ఉన్నదా? పిచ్చి వాడా అప్పుడే మర్చిపోయేవా? నిర్మల, నీలాకాశంమీద నిగనిగలాడే తారకా పరిభ్రమణముతో పోల్చివర్ణనచేసేవు. ఒక నాడు పోనీలే పందెం వెయ్యనక్కరలేదు. చూడు నాపావురాన్ని విడిచి పెడుతు న్నాను. పోనీ యిప్పుడు చెప్పు - ఎంత పైకి పోతుంనో, ఎంత ఆనందం ఆశ్చర్యం గొలిపేప్రదేశానికి పోతుందో.

చె:- మంచిప్రశ్నే అడిగేవు సారంగధరా! ఎవరు చెప్పగలరు యిటువంటి విషయా లకు సమాధానాలు. వినలేదూ 'అశ్వ ప్లుతం వాసవగర్జితంచా' అన్న ఆర్యోక్తి? గుర్రె మెప్పుడు సకిలించునో, మేఘు డెప్పుడు గర్జించునో, వాన రాకట-వెలి యుట అని. పురుషుని భాగ్యం, అన్నిటి కన్న ముఖ్యం. స్త్రీ చిత్తం మానవు లెవరు చెప్పగలరు చెప్పు దేవునికే తెలి యని పక్షంలో? ఇది కూడా అటు వంటిదే. ఎగురవెయ్యి పావురాన్ని ఏ వింతలు తనుచూసి నీకు చూపించునో నీవే తెలుసుకుందువుగాని. విడువు సారం గధరా, విడిచిపెట్టు పావురాన్ని.

సా:- అయితే యిదిగో, చెలికాడా విడు స్తున్నాను.

[పట పటమని రెక్కల చప్పుడు]

అదుగో బాణాసనంనుంచి దూసుకు పోయిన శరంలా ఎలా పోతున్నదో చూడు నాపావురం. అయ్యో! సూటిగా మీదికిపోక పక్కకుపోయిందే! ఎక్క డకు పోయిందబ్బా!

చె:- సారంగధరా! సారంగధరా! అవును సుమా! పక్కగా పోయి పోయి రాణి వాస గృహోన్ముఖం అయింది. అదిగో చూసేవా, చిత్రాంగిదేవి సౌధం దిక్కుగా పోయింది. అదుగో! అదుగో! సౌధం లోపలికే పోయిందే!!

సా:- ఆ! నిజంగానా! నిజం? అయితే పోయివద్దాము రా! నాతల్లి నడిగి పావు రాన్ని తీసుకుంటాను. పద చెలికాడా! పద .... నడువవేమయ్యా?

చె:- సారంగధరా! ఈపావురం కోసమే అచ్చటికి పోవలెనా! ఎందుకులే, వద్దు. నీవద్ద లెక్కలేనన్ని పావురాలుండగా దీనికోసం అంత తాపత్రయం ఎందుకూ? వద్దు పోదాము రా!

సా:- పిచ్చివాడా! నీమాటలు ఆశ్చర్యంగా ఉన్నాయే!

చె:- అవును నీకన్నీ ఆశ్చర్యమే! అంతఃపురా భ్యంతరాలలోకి నిరభ్యంతరంగా పోవ డానికి నీవు పసిపాప వనుకున్నావా?

సా:- చెలికాడా! కేవలం ఛాందసుడులా మాట్లాడుతున్నావే. ఈ అంతఃపురా

భ్యంతరలోకి నా కభ్యంతరమా? నాతల్లి వద్దకేగి పావురాన్నిమ్మని కోరటకు నా కభ్యంతరమా? పొరబడుతున్నావు నీవు. నీవన్నది నీకే అర్థమైందో లేదో తెలియదు. లేని పోని అనుమానాలకు నీలో తావిచ్చి నాలో జనింప చెయ్యడానికి ప్రయత్నించకు.

చె:- అయ్యో! పొరబడుతున్నది నీవా నేనా? ఈపాటి తెలుసుకోలేక పోయేవా సారంగధరా! నీతల్లి వద్దకు పోవద్దనినిన్నెవరు ఆటంకపెట్టగలరు? కాని కొంచెం యోచిస్తే అంతా విస్పష్టం అవుతుంది! ఈమె నీసవతి తల్లి. నవయవ్వన విలాసాలను అభిలషించే ప్రాయపు చిత్తరి పాపం! విధివశం చేత తన ఆశలు నిరాశలుకాగా అజ్ఞాతవాసం సాగిస్తూన్న కుసుమ కోమలి. నీవా! నవయవ్వన వనితా హృదయాన్ని దిగ్భ్రమలో ముంచి ఉక్కిరిబిక్కిరి గావించే అపూర్వ సౌందర్య వంతుడివి. వీటికి పైగా ప్రభువు విటలేరు. సారంగధరా! మరలి పోదామురా!

సా:- చెలికాడా! నీమాటలకు ఆశ్చర్యపడాలో, నవ్వాలో, విచారించాలో తెలియడంలేదు. లేనిపోని సందేహాలను వ్యర్థమైన ఊహాలతో నివృత్తి చెయ్యడానికి ఎందుకు ప్రయత్నిస్తావు? నాహృదయాన్ని యింత అర్థం చేసుకోలేక పోయేవని నేనెన్నడూ భావించలేదు. కాబట్టి నీ అభూత కల్పనాభిప్రాయాలను కట్టిపెట్టి రా పోదాము. పావురాన్ని తీసుకొని వద్దాము!

చె:- యువరాజా! నీహృదయాన్ని నేనర్థం చేసుకోలేక పోలేదు. కాని స్త్రీ హృదయాన్ని నీవర్థం చేసుకోనందుకు విచారిస్తున్నాను. నీ ఆజ్ఞకు అడ్డు చెప్పగలనా! పద సారంగధరా! నీయిచ్ఛ వచ్చిన చోటికి పోదాము.

[రంగము - చిత్రాంగి సౌధము - చల్లటి వీణా గానము.]

చెలి:- దేవీ! ఇదుగో! పావురం! ఎక్కడినుంచో ఎగిరి వచ్చిందిక్కడకు! యువరాజుగారి పావురంలా ఉందమ్మా దాని అలంకారం చూస్తే!

చిత్రాంగి:- ఆ! యువరాజుగారి పావురమా! ఏదీ? యిలా నా చేతికియ్యి (పావురాన్ని ముద్దు పెట్టుకొని) ఆహా! పారావతమా! ఎంతదయ కల్గిందినీకు! ఇంత కాలానికి నాదగ్గరకు వచ్చేవా? లోకం అర్థం చేసుకోలేని నా బాధను నీవు అర్థం చేసుకొని, నామీద జాలిగొని వచ్చేవా? మాటాడవేమి? సుకుమారమైన నీ శరీరం ఎంత అదృష్టం చేసుకున్నది. అబ్బ! పోనీలే-భయపడకు. ఏదో చెప్పలేని బాధోప శమనంకోసం నిన్ను నా హృదయానికి అదుముకొన్నాను. పాపం! ఉలికి పడ్డావు కాబోలు నా హృదయం అదురిపాటుకు? ఏవో అవ్యక్త మధుర

భావాలు సూచిస్తూ నావంక జాలిగా చూస్తున్నావా? ఆనంద దాయకమైన సందేశాన్ని గొనివచ్చిన నీకు నాకృతజ్ఞత. కాని ఆ సందేశాన్ని వ్యక్తం గావించలేని నీవు ఎందుకు ఈ కార్యభారం వహించేవు? నిన్ను బ్రతిమాలుకుంటాను నా ప్రియుని సందేశమేమిటో చెప్పవూ? నా దీనస్థితి తెలిసి కూడా నీవు యీ విధంగా ఊరుకోవడం న్యాయంకాదు సుమా ఈ దినం నిన్ను విడువను నిన్ను గూర్చి అన్వేషణలోనైనా నా మనోరథం నెఱవేర వచ్చును. ఎక్కడకు పారిపోదామనుకుంటున్నావు?

చె:- అమ్మా! అమ్మా! యువరాజుగారు వస్తున్నారు. మనసౌధానికే వస్తున్నారు! కొంచెం దూరంలోనే ఉన్నారమ్మా'

చి:- హా! అలాగునా! చెలీ ? నిజంగా మన సౌధానికే ? ఇదిగో ఈ పావురాన్ని తీసుకో వదలకు.

చె:- అమ్మా! మన సౌధానికే నమ్మా! పావురాన్ని వెతుక్కుంటూ వస్తున్నారు.

చి:- అయ్యో! యింత తలవని తలంపుగా వస్తారని అనుకోనేలేదే! అయితే యిప్పుడేలా ఆహ్వానించడమో తెలియడం లేదే చెలీ! ఏదో ఆందోళనగా ఉన్నది. నీవు పొరబడుతున్నావేమో, నిజంగా మన సౌధానికే వస్తున్నాడా సారంగధరుడు? లేక నన్ను ఆశగొల్పడానికి పరిహాసం చేస్తున్నావా?

చె:- అదేమిటమ్మా అలాగ నిన్ను నీవే మర్చిపోతున్నావు! చీర సరిగా సవరించుకోవమ్మా. ఇంతకాలం నుంచి ఈ అజ్ఞాత వాసంలో ఎందుకు ఏకాంతగా తపస్సు గావించేవు? ఊరుకోక పోయేవా నిన్ను బోలిన యితర నిర్భాగ్యులవలె? ఎందుకలా అకారణంగా గాబరాపడిపోతావమ్మా!

(సశేషము)

## వరకట్నము

జడ్డికక్కరంబు నుడువఁగ
గడ్డగు మగవాఁడు వేలకట్నం బడుగన్
ఒడ్డుం బొడుగుం గలిగిన
యొడ్డెమొకం బంచుఁ బరిహసింపరె విబుధుల్?

ఎన్నో వందలు వేలిడి
ఉన్నత విద్యాలయమున నున్నందునఁ జే
కొన్నావా వైదుష్యం?
బన్నా! వరకట్నవాంఛ యర్థం బగునా?

వరకట్నం బరికట్టఁగఁ దలఁచి, కావ్యా
లెన్నో సృష్టించి చి
త్తరువుల్ చూపిరి; ప్రొద్దు పుచ్చెడు నిమిత్తం
బయ్యె నాచేత లె
వ్వరు పాటించిరి? ఘోరశాసనము నల్పంగా
వలెన్ సంఘ సం
స్కరణాసక్తులు మంత్రిపుంగవులు వేగన్
భారతక్షోణిలోన్

చదలవాడ నాగరత్నము.

—(o)—



# సౌభాగ్యవతి కమల

శ్రీమతి ఉప్పులూరి వెంకట సత్యవతి

"పూజకొద్దీ పురుషుడు, దానంకొద్దీ బిడ్డలు" అని పెద్దలు చెప్పుదురు. స్త్రీ ఎన్ని నోములు నోచినా, ఎంత ప్రార్థనచేసినా తన చిరంజీవత్వమును కోరదు. తన ఐదవతనమునకు గాను అంత ప్రయాసపడును. 'చి॥సౌ' అనిపించుకొనుటకు గాను ఆమె అష్టకష్టాలుపడి వేయి దేవుళ్లకి మ్రొక్కుచుండును. కాన అందు తెలియబడునదేమనగా స్త్రీ స్వార్థస్వరూపిణి కాదు. త్యాగదేవత, ప్రేమదేవత. తన భర్త ఎటువంటివాడైననూ, అతని చిరాయురారోగ్య వృద్ధి ఐశ్వర్యములకు ఆమె తాపత్రయపడుచుండును.

భర్త అనగా ఎవరు? ఈ ప్రశ్న ద్వారము తెలిసికొనుటకు గాను, స్త్రీకి కొంత జ్ఞానము కావలెను. అపుడే ఆమె చేయు నోముల ఫలము గ్రహింపగలిగినటువంటిదగును. కాన బాల్యవివాహములు పనికిరావు. నేటి సమాజములో నూటికి ఎనుబది పాళ్లు తగ్గినప్పటికి, అక్కడక్కడ యింకా వున్నాయనిపించుచున్నవి. మరొకటేమనగా స్త్రీకి తగినంత చదువుకూడా వుండాలి. తన కాళ్లమీద తాను జీవింపగలననుకున్నంత చదువు తప్పక వుండాలి. అప్పుడే ఆమె మానవలోకములో తన స్థానము తెలిసికొని, సంఘసమాజ ప్రవృత్తులను గ్రహించి తదనుగుణ్యముగా తన జీవితనౌక సంసార సాగరమున నడిపింపగలదు. లేదా విపంఖశలభమై పోవలసివచ్చును. ఇందుకు తార్కాణముగా ఈ క్రింద ఒక చిన్నకథ వ్రాసితిని. నేటి సమాజములో యిటువంటివి జరుగుచున్నవి.

కమల, విమల అనే ఒకేయీడుగల యిరుగుపొరుగు బాలికలు చిన్ననాటి స్నేహితులు. రెండు కుటుంబములుకూడా సామాన్యమైనవి. విమలకు చిన్ననాడే వివాహమైనది. ఆ వయస్సులో అభంశుభం యెరుగని పిల్ల. స్త్రీ జీవితములో వివాహమనునది కాలకృత్యములలో నొకటిగా పరిగణించేవయును. వివాహము జరిగిన మరుసటి సంవత్సరమే భర్త పరలోకగతుడాయెను. ఇప్పుడు విమల వయస్సు 11 సంవత్సరములు.

ఇంతవరకు ఏబుద్ధినవున్నాడో, కమల తండ్రి కమల వివాహ ప్రయత్నములు చేయుటలేదు. ఇక ఈ ప్రళయాన్ని చూచినమీదట యిప్పట్లో చేయకూడదని నిశ్చయించుకున్నాడు. కమలను చదివింప ప్రారంభించినాడు. స్కూలు ఫైనల్ అయింది. అది జ్ఞానోదయ మయ్యేటటువంటి వయస్సు. ఆమె కోరికపై కాలేజిలో ప్రవేశింపచేసినాడు తండ్రి. ఇప్పుడామెకు 15 సంవత్సరములు. తండ్రి వివాహం ప్రయత్నములు చేయసాగెను. ఈమెకూడా తనకుతగిన భర్తను తెలిసికొనుజ్ఞానము కలదికాబట్టి, తండ్రితో సహకరించి యం.బి.,బి.యస్ చదువుతున్నటువంటి ఒకనిని పెండ్లాడెను. భర్త యిష్టప్రకారము ఈమె తన ఇంటర్ చదివింది. పాసయింది.

విమలకుకూడా యిప్పుడు 17 సంవత్సరములు. ఈ యవ్వనములో ఆమెను 'గం॥భా॥స॥' అనవలసి వచ్చెను - పాపము, ఇదిచూచి సహించలేక తండ్రి పునర్వివాహము చేసి, ఏకైక పుత్రికను విడువలేక అల్లుని యిల్లరికముంచుకొనెను. అతనొక త్రాష్టుడుగా మారెను. అన్ని దురలవాట్లకులోనై అప్పులు మామగారిపేరిట చేయనారంభించెను. క్రమేణా భరించరానివైనందువలన చెల్లించలేక ఆస్తిపాస్తులన్నియూ అమ్ముకోవలసివచ్చెను. ఈ బెంగచేతనే విమల తలిదండ్రులు కాలాహుతి అయిరి. మరికొంత కాలమునకు విమల భర్త సంసారమును - అనగా తన యిద్దరు బిడ్డలనుకూడా - పోషించలేక యిల్లువిడచి, ఊరు విడచి వెళ్లిపోయెను. పాపం విమల బిడ్డలతో అష్టకష్టాలుపడుచుండెను. ఇంతవరకు కమల తలితండ్రులు ఆదరణ చూపుతునేవున్నారు.

ఇక కమల వృత్తాంతమేమన, ఆమె భర్త డాక్టరీ ప్యాసయిన తర్వాత గవర్నమెంటువారే అతనిని భర్తీచేసికొనిరి. ఆయన యిప్పుడు విజయవాడకు బదిలీఅయిరి. కమల విమలను గురించీ, ఆమె పరిస్థితులను గురించి వుత్తరములద్వారా వింటునే వున్నదికాని, పుట్టినింటికి వెళ్ళి నాలుగు సంవత్సరములు జరిగినవి. భార్యనువిడచి వుండలేని భర్త, అంత అన్యోన్య ప్రణయము.

విమల యిక ఆ వూరిలో వుండుట యిష్టములేక విజయవాడకువచ్చెను. తిండికి సరిగా జరుగనందున, చిక్కి నల్లబడి ఆనవాలు బట్టరానిదైనది. బిడ్డలిద్దరుకూడా అట్లే వున్నారు. ఇక విజయవాడలో తన చిన్ననాటి స్నేహితురాలైన కమల యిల్లు వెతికికొనుచు వెళ్లెను. కమల ఆనవాలు పట్టలేదు. ఆమె బిడ్డలను అసలు చూడనేలేదు. ఆనవాలు పట్టకపోవుట చూచి విమల వంటపనికత్తెగా చేరెను. ఉదార స్వభావులగు భర్త విమల బిడ్డలనుకూడా తమయింటనే వుండనిచ్చెను. తిండి సరిగా వుండుసరికి విమలకు తిరిగి తన పోలికలు రాజొచ్చెను కొన్నాళ్లకు. ఇప్పుడు కమల ఆమెలో విమల చిహ్నములు గ్రహించి "మీదే యూరని అడిగింది." దాని మీదట.

విమల:- మొదటనే చెప్పితినికదమ్మా, 'ఒంగోలు' అని.

కమల:- కాదనుకుంటాను. మీది నెల్లూరుకదూ! మీతండ్రి గంగాధరరావుగారుకదూ! నీకొక స్నేహితురాలు కమల అని ఒకతె వున్నదికదూ! నీపేరు రమణమ్మ అని చెప్పితివే విమలకదూ! ఇంకా నీ...

విమల:- "చాలునమ్మా, నీవు చెప్పినవన్నీ నిజమే" అని ఏడ్వసాగెను. కమల ఆమెను ఓదార్చి ఆమె ప్రస్తుత పరిస్థితులన్ని తెలిసికొని, తన యింటనే వుండుటకు సంతోషించెను. ఎప్పటికైనా నీ భర్త మరల నీదగ్గరకు రాకతప్పదని ఓదార్చెను.

విమల:- కమలా! చివరకు నా పరిస్థితి యిట్లా వచ్చింది. తలితండ్రులు పోయారు. భర్త దేశాంతరగతుడాయెను. ఆస్తిపాస్తులన్ని గుల్ల అయ్యెను. సమాజములో పనికిమాలిన దాననైతిని. దరిద్రునకే సంతానమనునట్లుగా యిద్దరు బిడ్డలు. దీనికంతకూ కారణము ముప్పాతిక విధివ్రాత. పాతిక నాకు జరిగినటువంటి బాల్య వివాహము, చదువులేకపోవుట, వీటి మూలముగా సమాజములో పనికిరానిదానగుట, వీటి నన్నింటిని ఒడిగట్టుకొంటిని. చదువులేనిదే జ్ఞానమురాదు కమలా. జ్ఞానముంటేనే లోకప్రవర్తన తెలిసికొని నడచుట వీలగును. ఆవిధముగా ఎవ్వరైతే వుందురో, తమకు తగిన భర్తను తెలిసికొనుటకు వీలగును. అప్పుడే, జీవిత సౌఖ్యం, ఆనందం, మహదానందం. ఇవి అన్నిటిని కలిగినటువంటి 'సౌభాగ్యవతి కమల'వు నీవే.

—(0)—

# ఆవుబుల్లాయి

శ్రీ బి. యస్. రాజారెడ్డిగారు

స్నేహితులయింటికి వెళ్లాను. ఇంటికి పడమర చెరువు, తూర్పున పొలాలు, అరఫర్లాంగు దూరాన ఊరు. స్వేచ్ఛావాయువులు పీల్చేందు కనువైనచోటు.

గోమాతను పోషించినందుకు కృతజ్ఞతగా ఒకచక్కని బుల్లాయిని యిచ్చింది. బుల్లాయిని ముద్దుగా అందెలు, మువ్వలతో అలంకరించారు. వసారాలో గుంజకి కట్టేసారు. తెల్లవారుతోంది. కాకులు కూస్తున్నాయి.

పద్మబాంధవుడు తూర్పుదిశను తనరాక నెరిగించే రంగారు బంగారు ఛాయలను పైపైకి పంపుతున్నాడు. వసారాలో మంచంమీద కూర్చుని పలుతోముకుంటున్నాను. ఆవుబుల్లాయి "శివలింగం ముందు నందీశ్వరునిలాగా" తూర్పుదిశకు తిరిగి పడుకుంది. ఎవరికోసమో ఎదురు చూస్తునట్లున్నది. ఆలేగ భావాలను అర్థంచేసుకునే కుతూహలం కల్గింది. లేగ ఆదుర్దగా చూస్తుంది. నేనటే చూస్తున్నాను. ఒక్కసారి గభీమని లేచింది. మువ్వలు ఘల్లుమన్నయ్. 'అంబా' అంది. చావిట్లో గోమాత ఎదురుపల్కింది. వారి దగ్గరఉన్న పాలేరు రాధ వచ్చాడు. పది, పదకొండు సంవత్సరాలుంటాయి. ఎప్పుడు నవ్వుతూయుంటాడు. ఆవు బుల్లాయికి ఆదుర్దా ఎక్కువైంది. గుంజచుట్టూ తిరుగుతుంది. 'అంబా' 'అంబా' అంటుంది కాని, త్రాడుతో బంధించియున్నది. 'దానిభావాలకు రూపం యిస్తే' అనిపించింది. చాలా కష్టమైంది, కాని నాకలం ధైర్యం చేసి నాచేత ఇలా వ్రాయించింది.

రావోయి రాధ
నాప్రియతమ బాలభాస్కరా!
కాకుల కూతల కలవర పాటుకు, లేచిచూడగ
కనిపించె నదేనోయి నీనగుమోము,
వినిపించె నదినోయి నీముత్యాల మాటలు
నాతల్లికడకు నన్ను గొంపోయి
నీమాతృ ప్రేమను నిలుపుకోవోయీ
నాకాలిమువ్వల అందెలా సందడి
నలుగురికి వినిపింప
నాకట్లు విప్పవోయీ, బాలకా,
నాకడుపు నింపవోయి




ఓమము :- దీనిపొగ పడిసెపు భారమును అణచును. దీనిరసము వెచ్చజేసి చెవిలో వేసిన కర్ణశూల పోవును. దీనిరసము లోపలకు పుచ్చుకొనిన గుండెశూల తగ్గును. కడుపులోని వికారములు, త్రేపులు, అజీర్ణ విరేచనములు, కడుపుబ్బరముల పోగొట్టును. బిడ్డల అజీర్ణము, నీళ్లవిరేచనములు కట్టును. ఓమము, మిరియాలు, ఉప్పు, సమపాళ్లుకలిపి పరగడుపున వాని చూర్ణము తినిన జీర్ణశక్తి వృద్ధియగును.

జీలకర్ర :- దీనిని వేయించి చేసిన చూర్ణముగాని లేక కషాయముగాని సేవించిన పైత్యము, కఫము, శూల, తలతిప్పుట పోవును. స్త్రీలకు పాలు బడజేయును. స్త్రీలకు బహిష్టగుట క్రమబరచును.

దాల్చినిచెక్క :- చూర్ణము - రక్త వమనముకట్టును. స్త్రీల రజోరక్తమును శుభ్రపరచి జారచేయును. శీఘ్ర ప్రసవము గావించును. దాల్చినిచెక్క నూనె ద్రవము మింగుచుండిన ఋతు బద్ధకముండదు.

శొంఠి :- చూర్ణము, రసము, కషాయము, అజీర్ణము, వాతము, పీనస, కడుపులోని బల్ల, క్రిమి వీనిని హరించును. తులము చూర్ణము వేడిఅన్నములో కలిపి ప్రథమ కవళముతో తినిన రక్తగ్రహణి కట్టును.

కరక్కాయ :- చూర్ణము విరేచనములగును. కషాయము విరేచనముల కట్టును. జీర్ణశక్తి గలిగించు ఔషధము. చంటి బిడ్డలకు దగ్గు వగైరాలను పోగొట్టును.

మ॥ వె॥ రమణమ్మ.

# కీ॥ శే॥ శ్రీమతి ఆచంట రుక్మిణి లక్ష్మీపతిగారు

మనరాష్ట్రములో అనాదినుండి మహిళా సమాజముల నిర్మాణమునకు, తద్వారా మహిళాభ్యుదయమునకు కృషిచేసిన నాయకురాండ్రలో శ్రీమతి ఆచంట రుక్మిణి లక్ష్మీపతి గారు ఒకరు. కాంగ్రెస్ ఉద్యమంలో పాల్గొని అనేకసార్లు కారాగారశిక్ష ననుభవించారు.

తమిళనాడు కాంగ్రెస్ కమిటీ లోను, మద్రాసు విశ్వవిద్యాలయము సెనేటులోను, మద్రాసు కార్పొరేషనులోను సభ్యులుగా కూడ నున్నారు. ఈమె సంఘసేవా పరాయణత్వము కొనియాడ తగినది.



1935 సంవత్సరంలో కాంగ్రెస్ అభ్యర్థిగా మద్రాసు కౌన్సిలుకు ఎన్నుకోబడ్డారు. మరల 1937 సంవత్సరములో శాసనసభకు ఎన్నుకోబడి 1939 వరకు డిప్యూటీస్పీకరుగా పనిచేశారు.

స్వాతంత్ర్య సమరంలో వీరోచితంగా పాల్గొని విజేతగా 1945 సంవత్సరంలో శాసనసభకు ఎన్నుకోబడి ప్రకాశంగారి మంత్రివర్గంలో ఆరోగ్యశాఖ మంత్రిగా నైన ప్రథమస్త్రీగా రాణించారు.

ఈమె సుప్రసిద్ధ వైద్యులు డా॥ ఆచంట లక్ష్మీపతి గారి సతీమణి.

శ్రీమతి రుక్మిణి లక్ష్మీపతిగారు ఆగస్టు 6 వ తేదీనాడు మద్రాసులో మరణించిన వార్త మహిళా లోకమునకు చాల సంతాపకరమైనది. ఆమె ఆదర్శవంతమైన జీవితం మహిళలకు మార్గదర్శకమగుగాక!

# సినిమా రంగము 

ఫిలింకార్ వారి 'అనార్కలీ' చిత్రం షూటింగు గత ఏప్రియలు నెలలో ప్రారంభమయింది. ఈ చిత్ర నిర్మాణమునకు షుమారు 30 లక్షల రూపాయలు వ్యయము కాగలవని అంచనా. ఇందు మీనాకుమారి, కమల్ కపూర్‌లు ప్రముఖ పాత్రలను నిర్వహిస్తున్నారు. ఇందులో మొగలు సామ్రాజ్యము నాటి వైభవమును సమగ్రంగా రూపించడానికి ప్రయత్నములు జరుగుచున్నవి.

♦ ♦ ♦

"ఝాన్సీకిరాణి" చిత్రాన్ని మినర్వా మూవిటోనువారు టెక్నికలర్‌లో నిర్మించనున్నారు. మన దేశములో టెక్నికలర్‌లో నిర్మించబడనున్న ప్రథమ చిత్రము యిదియే. టెక్నికలరులో చిత్రనిర్మాణమునకు వలసిన సాపకాశాలు, మనదేశములో లేకపోవుటచే ప్రఖ్యాతి అమెరికను, ఇంగ్లీషు టెక్నీషియన్‌లను రప్పించనున్నారు. వారి సహకారంతో యీ చిత్రాన్ని మహోన్నతమయిన చిత్రంగా సొహరాబ్ మోడీ నిర్మించనున్నాడు.

♦ ♦ ♦

భరణీ పిక్చర్సువారి "ప్రేమ" చిత్రం తెలుగు, అరవభాషలలో త్వరత్వరగా షూటింగు జరుగుతున్నది. జూలై నెలాఖరుకు సంపూర్తి యగుతుందని వార్త. యావద్భారత ఉత్తమనటిగా ప్రఖ్యాతి గాంచిన ఆంధ్రతార భానుమతి, నాగేశ్వరరావు, ముక్కామల యిందులో నటిస్తున్నారు. ఉదకమండల పరిసరాలలోని రమణీయమైన ప్రకృతిదృశ్యాలను శ్రీ కమల్‌ఘోషు కడుసమర్థతతో యిందు ఛాయాగ్రహణం చేశాడు.

ఈ చిత్రానికి తెలుగు, అరవములలో స్క్రిప్టు వ్రాసినవారు శ్రీ కె. జీ. శర్మ, ఉదయకుమార్, శాంతారాం గారలు.

భరణీ పిక్చర్సువారు మరిరెండు చిత్రాలనుకూడ త్వరలో తీయడానికి ప్రారంభం చేస్తారట.

# శ్రీ దశావతార స్తోత్రము

శ్రీమతి దోమా ఇందిరాదేవి

శ్రీ వైకుంఠమునన్ రమారమణితో శేషాహిపై నుండియున్
దేవేంద్రుండు మొదల్గ వేల్పుగమియున్ దివ్యర్షులు న్నిత్యమున్
సేవింపన్ దయఁజూచు విష్ణువునకున్ జిత్తాంబుజంబందునన్
భావవంగావలె నంచుఁ జేసెద నమస్కారంబు లెన్నేనియున్ ॥

## శ్రీ మత్స్యావతారము

సోమకుఁ డాగమంబులను జోరత్వమైఁ గొనిపోయి వార్ధిలో
తామసుఁగొందఁగా నలమదంబణఁగింపఁగ మీనరూపము
ద్దామతమై ధరించి, అలదానవుఁ గూల్చియు, వేదముల్ రహిన్
దామర చూలికిచ్చిన యుదారుని శ్రీశుని గొల్తు నిచ్చలున్ ॥

## శ్రీ కూర్మావతారము

దేవతలున్ నిశాచరులుఁ దీక్షణుగా నమృతంబుపొందు సం
భావనతోడఁ బూని, అలమందరమున్ గలశాబ్ధి నుంచియున్
వేవిధిఁద్రచ్చ, నన్నగము వేకమరంబయి, మూఁపునన్ గడున్
ఠీవిగ నెత్తినట్టి అల నీరజలోచను భక్తినెంచెదన్ ॥

## శ్రీ వరాహావతారము

మేలిమి కంటివాఁడు పుడమిన్ సకలంబును జంకబెట్ట నా
భీలవరాహ రూపమున వ్రేల్మిడి వానిని గూల్చి, భూమికిన్
మేలొనరించినట్టి సదమేయుఁడు భవ్యదయాసముద్రుఁడా
శ్రీలలనా మనోహరుని జిత్తమునందుఁ దలంతు నెప్పుడున్ ॥

## శ్రీ నరసింహావతారము

పెళ పెళఁ గంబ మాసభను వ్రీలిన సందడికెల్ల లోకముల్
కళవళ మొందఁగాఁ, బ్రళయ కాల మహాప్రభ, నారసింహుడై
యలఘుజవంబునన్ దనుజు నంతముఁ జేసియు, వాని పుత్త్రిన్
వెలసిన పేర్మి నేలిన యవేల పరాక్రము, విష్ణు మ్రొక్కెదన్ ॥

### శ్రీ వామనావతారము

వడుగగు రూపమొందియును, బల్యసురున్ దరిఁజేరి, భూమి మూ
డడుగుల వేఁడి, దేహమును నంతటఁ బెంచియు, నబ్బలీంద్రునే
లడుగుకంపి, దేవపతి కందఱు మెచ్చఁగ మేలుచేయు దే
వుడు నను బ్రోచుఁ గాతమని పూర్ణసుభక్తి నమస్కరించెదన్ ॥

### శ్రీ పరశురామావతారము

ఇరువదియొక్కసారు లవనీశులఁ జంపియు, వారి నెత్తుటన్
బరఁగను దండ్రితాతలకు భక్తిని తర్పణముం బొనర్చియున్
సరగున నీశ్వరున్ గొలుచు సార పరాక్రమ శాలియైన శ్రీ
పరశుధరుండు, రాముని భక్తిని నంజలిచేసి మ్రొక్కెదన్ ॥

### శ్రీ రామావతారము

శ్రీ రఘువంశమందు నను చెల్వుగ పంక్తిరథాత్మజుండవై
పేరున రామమూర్తివయి, ప్రేమను సీతను బెండ్లియాడి, కాం
తారముఁజేరి, ఘోరతర దైత్యుల రావణ కుంభకర్ణ ము
ఖ్యారుల సంహరించిన నవాంబుజలోచన, నీకు మ్రొక్కెదన్ ॥

### శ్రీ బలరామావతారము

ధేనుక ముష్టికులనియెడి దానవులనుగూల్చి, భువికి దగ సంతసమున్
పూనించిన నాగటి దాల్పా! నను రక్షింపుము, బలరామా! దేవా ॥

### శ్రీ కృష్ణావతారము

వసుదేవాత్మజుఁడై ప్రజార్భకతతిన్ బాలించియున్, గోపికా
విసరంబున్ ముదమొందఁ జేయుచును, తీవిన్ గంసదైత్యాదులన్
గసుమాలంబుగఁ జూచి రుక్మిణికి హృత్కంజార్కుఁడై భక్తులన్
బసమైనేలు సమస్తపాపహరు, గోపాలప్రభున్ గొల్చెదన్ ॥

### శ్రీ కల్క్యవతారము

ఇలశిష్టుల రక్షింప పగ ఖలులను శిక్షించుకొరకు, - కలికాలమునన్
"గలికి" శుభాకారుండై సలలితముగ నేలు హరిని సారెకుఁ గొల్తున్ ॥

——(:o:)——

# ఉత్తర మద్రాసులోని తెలుగు విద్యార్థినుల కడగండ్లు

——)o)——

ఉత్తర మద్రాసు ప్రాంతమున చాలామంది తెలుగువారు నివసించుచున్నారు. ఇచ్చటి తెలుగు బాలికలకు తెలుగున పాఠములు నేర్పు మిడిల్ స్కూలుగాని, హైస్కూలుగాని లేనందున గొప్ప విద్యాలోపము జరుగుచున్నది. ఈ ప్రాంతములోని పి. టి. త్యాగరాయచెట్టి హైస్కూలులో బాల బాలికలకు తెలుగు, తమిళ భాషలలో చాల సంవత్సరాలుగా పాఠములను ప్రవీణతతో నేర్పుచుండిరి. కాని పోయిన సంవత్సరమునుండి ఆ స్కూలులో ఏ తరగతిలోగాని బాలికలను చేర్చుకొనుటను పూర్తిగా మానివేసిరి. తమిళములోనే బోధించు రెండు ఇతర హైస్కూళ్లు, సెంట్ ఆనీస్ కాన్వెంట్ గరల్స్ హైస్కూలు, నార్త్‌విక్ గరల్స్ హైస్కూలు, ఈ ప్రాంతములోనే యుండుటచే తమిళ బాలికలకు విద్యాభ్యాసమునకు ఎట్టి ఆటంకములేదు. తెలుగులో బోధించు ఇతర మిడిల్ స్కూలుగాని హైస్కూలుగాని లేకుండుటచే, ఇచ్చట తెనుగు బాలికలు తెలుగున చదువుకొనుట కవకాశములేక అనేక కడగండ్లు పడుచున్నారు.

ఈ ప్రదేశానికీ, జార్జిటవున్ ప్రాంతాని కంతకు నారాయణ మొదలివీధిలోనుండు కె.టి.సి.సి. గరల్స్ హైస్కూలు ఒక్కటే తెలుగు హైస్కూలు. ఇట్టి తెలుగువారి పరిస్థితి మిక్కిలి శోచనీయము. ఈ పాఠశాల ఉత్తర మద్రాసు బాలికలకు చాలదూరము. బస్సు, ట్రాము మార్గములకు చేరువనలేదు. అచ్చటికి బాలికలను వేరు సౌకర్యములద్వారా పంపుటకు సామాన్య గృహస్థునికి వీలుకానిపని. కావున చాలమంది తెలుగు బాలికలు విద్యనభ్యసించుటకు వీలులేక ఇంటిలోనేయుండుట తటస్థించుచున్నది.

మద్రాసు నగరమున అన్నిభాషలవారుండుటచే వారందరికి వారివారి మాతృభాషలలో విద్యాబోధనము చేయుట ప్రభుత్వధర్మం. ప్రభుత్వ విద్యాధికారులు తగుశ్రద్ధవహించి సెంట్ ఆనీస్ కాన్వెంట్ గరల్స్ హైస్కూలులోగాని లేక నార్త్‌విక్ గరల్స్ హైస్కూలులోగాని వచ్చే జూన్‌నుండి అయినను తప్పక తెలుగు సెక్షనులు ఆరంభించునట్లు చేయవలయును. మరియు ఇచ్చటనుండు నార్త్ మద్రాసు హిందూ హైయ్యర్ ఎలిమెంటరీ గరల్సుస్కూలులో ఎనిమిదవ క్లాసువరకు తమిళము, తెలుగులోనుకూడ బోధన జరుగుచున్నదిగాన, తెలుగు సెక్షనులను యుంచు షరత్తుతో దీని మేనేజిమెంటువారికి గవర్నమెంటువారు తగుప్రోత్సాహమిచ్చి హైస్కూలుగా రాబోవు సంవత్సరమునుండియైన మార్పించునట్లు చేసిన, ఇచ్చటి తెనుగు బాలికలకు విద్యాభంగం లేకుండ పోవును.

వి. పాండురంగరావు



# లోక వార్తలు

సుప్రసిద్ధ పత్రికా రచయిత, జాతీయవాది, జై భారత్ పత్రికా సంపాదకులుగానుండిన శ్రీ న్యాపతి నారాయణ మూర్తిగారి నిర్యాణమునకు ఆంధ్ర ప్రజానీకం తమ సంతాపమును వెల్లడించింది.

◆ ◆ ◆

ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంగారి కంచు విగ్రహ ఆవిష్కరణ మహోత్సవము జూలై 22,23 తేదీలలో శ్రీ డాక్టరు ప్రఫుల్లచంద్ర ఘోషుగారి అధ్యక్షతన భారతప్రభుత్వ రవాణా శాఖామంత్రి గానుండిన రఫీఅహమద్ కిద్వాయిగారిచే మహా వైభవంగా జరిగింది. వేలాదిప్రజలు ఉత్సవములో పాల్గొనిరి.

◆ ◆ ◆

ఈ సంవత్సరం ప్రత్తిపంట దండిగా నున్నందున ప్రజలకు గుడ్డ దండిగా దొరకవచ్చుననియు, గుడ్డ ధరకూడ క్రమంగా తగ్గవచ్చునని మద్రాసు పరిశ్రమల శాఖామంత్రిగారు వెల్లడించారు.

◆ ◆ ◆

పశ్చిమ గోదావరిజిల్లాలో యిటీవల కురిసిన కుంభవృష్టివలన ఏరులు, కాలువలు, వాగులు విపరీతముగా పొంగి ఏలూరు, తాడేపల్లిగూడెం, నర్సాపురం, తణుకు, నిడదవోలు తాలూకాల యందలి వేలకొలది యకరాల వరిపంటకు అపారమైన నష్టం ఏర్పడింది.

◆ ◆ ◆

స్వామి సీతారాంగారి ఆంధ్రా నందయాత్ర రాయలసీమ జిల్లాలలో జూలై 29 తేదీ ప్రారంభమయింది.

◆ ◆ ◆

ఆగష్టు నెల 12వ తేదినుండి బియ్యం రేషను 6 ఔన్సులకు తగ్గించబడింది. దాంతోపాటూ మద్రాసు పడి 1కి 7 దమ్మిడీలు ధర పెంచబడింది. తగ్గినరేషనుకు బదులుగా గోధుమలుగాని, జొన్నలుగాని, మైదాపిండిగాని లభిస్తుంది. ఈ తగ్గింపుకు కారణము ఇండియా ప్రభుత్వమువారినుండి బియ్యం అందే అవకాశము కనిపించక పోవడమట.

◆ ◆ ◆

భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణావశ్యకతపట్ల తనకుగల అభినివేశాన్ని ప్రకటిస్తూ దక్షిణాపథంలో యీ విషయమై ఏకీభావమున్నదనియు, భాషా ప్రయుక్తరాష్ట్రాల నిర్మాణమునకు వెంటనే పూనుకోవలెననియు కాంగ్రెస్ అధిష్టానవర్గం భారతప్రభుత్వానికి సిఫారసు చేసింది.

◆ ◆ ◆

తిరుపతిలో శ్రీ వెంకటేశ్వర కళాశాల నూతన భవనమును రాష్ట్రముఖ్యమంత్రి శ్రీ కుమారస్వామి రాజాగారు యీనెల 12వ తేదిన ప్రారంభోత్సవము చేశారు. ఈభవన నిర్మాణమునకు 12 లక్షల రూపాయలు వ్యయమయింది.

◆ ◆ ◆

బర్ద్వాన్ ప్రాంత గ్రామాలలో వరుణదేవుని అనుగ్రహమునకుగాను కప్పలకు పెళ్లిళ్లు చేస్తున్నారట. ఇది పూర్వాచారాలలోనొకటి. వానలేక వరినారు ఎండిపోతున్నది. వెంటనే వాన కురవకపోతే వరిపంట పండే అవకాశములు లేవట.

◆ ◆ ◆

సెప్టెంబరు 10-వ తేదినాటికి భారతదేశానికి విదేశాలనుండి 6 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు వస్తవని అధికారరీత్యా వార్త.

◆ ◆ ◆

దేవకోట సమీపములో నెమ్మిలిఅనే గ్రామంలో ఒక స్త్రీ తన అయిదుగురు పిల్లలను పోషించలేక 5 నెలల పసికూనను రు 5 లకు విక్రయించిందట.

◆ ◆ ◆

జమీందారీల రద్దుసవరణ చట్టమునకు ఇండియా ప్రెసిడెంటు అనుమతి నిచ్చాడు.

◆ ◆ ◆

మన రాష్ట్రంలో వాణిజ్య పంటలు పండే భూములనిస్తు హెచ్చించడానికి ప్రభుత్వము నిశ్చయించింది.

◆ ◆ ◆

షెడ్యూల్డు తరగతులు, జాతులు, వెనకబడిన తరగతుల వారికి విద్యార్థి వేతనములిచ్చే నిమిత్తం యీ ఏడాది ఖర్చుకు 15 లక్షల రూపాయల గ్రాంటును ఆర్థికస్థాయి సంఘం మంజూరు చేసింది.

◆ ◆ ◆

పండిత నెహ్రూ, మౌలానా అజాద్ గారలను కాంగ్రెస్ కార్యవర్గమునుండి, కేంద్ర ఎన్నికల సంఘంనుండి, పార్లమెంటరీ బోర్డునుండి తొలగడానికి నిశ్చయించుకొని కాంగ్రెస్ అధ్యక్షుడికి యీ నెల 10-వ తేది తెలియచేశారు.

◆ ◆ ◆

ఆంగ్లోపర్షియను సంప్రతింపులు సాఫీగా జరుగుచున్నవి. దాని మూలంగా టెహరాన్‌లో ఉద్రిక్తతతగ్గి ప్రశాంత పరిస్థితులు ఏర్పడుతున్న సూచనలు కనుపిస్తున్నవి.

◆ ◆ ◆

గోదావరి విపరీతంగాపొంగి ప్రవహించుచుండుట వలన భద్రాచలం మునిగిపోయే ప్రమాదం ఏర్పడింది.

◆ ◆ ◆

నిడుబ్రోలులో గుంటూరుజిల్లా కలెక్టరు ప్రసూతి వైద్యశాలకు యీ నెల 8-వ తేదిన ప్రారంభోత్సవము చేశాడు.

◆ ◆ ◆

ఎన్నికల అనంతరము సి. తరగతి రాష్ట్రాలకు పార్లమెంటరీ ప్రభుత్వ విధానము నమలు పరచుటకు ప్రభుత్వము నిర్ణయించింది.

◆ ◆ ◆

క్షామనివారణకై ఏర్పాటుగావించి నిధినుండి పండిత నెహ్రూయింతవరకు లక్షరూపాయలు మదరాసుకు పంపినారట.

◆ ◆ ◆

నూతనముగా నిర్మాణమైన ఫ్రెంచి మంత్రివర్గంలో డాక్టరు యం. చివలీయర్ విద్యాశాఖ మంత్రిగా నియమితుడైన 24 గం||లకే ఆయన భార్య అతనిని రివాల్వర్‌తో కాల్చి చంపింది. అందుకు కారణం భర్త తనకు విడాకులివ్వ సంకల్పించుకొనడమట.



హాంకాంగునగరంలో రెండేండ్లవయస్సుగల బాలిక గర్భమునుండి పిండమును శస్త్రచికిత్సచేసి బయటికి తీశారట.

ఈ రెండుసంవత్సరముల వయస్సుగల తల్లి పుట్టేటప్పుడు కడుపు పెద్దదిగానుండినదట. ఆపిల్ల పెరిగే కొద్ది కడుపుపెద్దదయి ఆరోగ్యము చక్కగా నుండేదట. రెండేళ్లు నిండేటప్పటికి శరీరఉష్ణం అధికమయిందట.

హాస్పిటలులో పరీక్షచేసి యాక్సరేతీయగా గర్భమున పిండమున్నట్లు గుర్తించబడింది. వెంటనే శస్త్రచికిత్సచేసి పిండమునుతీశారు. పిల్ల కులాసాగానే యున్నదట.

♦ ♦ ♦

రక్తపుపోటువలన, హృద్రోగాలవలన బాధపడువారికి ఆహారంలో ఉప్పు క్షేమకరంకాదు. అందువలన ఆహారంలోని లవణాన్ని దూరంచేయడంకొరకు మొదటిసారి అరగంటసేపు ఉడికించి తర్వాత రెండుసార్లు ఉడుకుపట్టేవరకు నిప్పుమీదనుంచవలెను. ప్రతిసారి ఉడకపెట్టగానే అందలినీళ్లు పారబోసి కొత్తనీళ్లు పోయుచుండవలెను. ఈలాచేయడంవలన ఆహారంలోని విలువతగ్గదు, త్వరగా జీర్ణమగుతుందని డాక్టరు ఆరెస్టెయిన్ అభిప్రాయం.

♦ ♦ ♦

చార్లెస్ ఫిలిప్స తన రెండేళ్లకుమారుడు చుట్టలు త్రాగేడనే నేరమునకు కోర్టు 100 డాలర్లు జుల్మానా వేసింది. న్యాయమూర్తి కనీసం 14 సంవత్సరములవరకు పొగత్రాగనుద్దేశించకూడదని ఆ బాలుని మందలించాడట.

♦ ♦ ♦

మధ్యభారత్ యందలి పన్నాయందు వజ్రాలగనులున్నట్లు కనిపెట్టారు. త్వరలో పని ప్రారంభించి వజ్రాలనుత్రవ్వి తీస్తారట.

♦ ♦ ♦

ఇంతవరకు 20 సంవత్సరములలోపల 50 సార్లు శిక్షించబడ్డ గజదొంగ షేక్ కాశిం ఆలీని దొంగతనం నేరానికి జూన్ 18.వ తేదిన కలకత్తా నగరంలో అరెస్టుచేశారు. ఇన్నిసార్లు శిక్షననుభవించిన వారు కలకత్తా నగరంలో మరెవ్వరులేరట.

♦ ♦ ♦

గాంధీజీ జీవితచరిత్రను 3 లక్షల రూపాయల ఖర్చుతో రచించుటకు భారత ప్రభుత్వ ప్రచురణ శాఖ వారు కృషి ప్రారంభించియున్నారు. ఈ గ్రంథము 2 సంపుటములుగానుండి యింతవరకెన్నడు ప్రకటితము

గాని 600 చిత్రపటములుండును. గాంధీజీ యావజ్జీవ సహచరుడుగానుండిన కాకాసాహెబ్ గారు 5000 మాటలలో గాంధీజీ జీవితకథను వివరించునట. 2½ సంవత్సరములనుండి సాగుచున్నరచన ఒక సంవత్సరమునకు పూర్తికాగలదు. రాష్ట్రపతికి మైసూరు చిత్రకారుడు బహూకరించిన గాంధీజీ చిత్రము పైఅట్టమీదనుండును. ఈ గ్రంథము సమగ్రముగాను, యథాతథముగా నుండును. సర్వోదయ కమిటివారు భారత ప్రభుత్వమువారు సంయుక్తంగా యీగ్రంథమును ప్రచురించెదరు.

◆ ◆ ◆

నెల్లూరులో బాలరాజు మహర్షిగారు ఓషధి ప్రక్రియలద్వారా 6 - వేలమంది రోగులకు జయప్రదంగా చికిత్సచేశారు. వారిలో క్షయ, కుష్టువంటి పెద్దరోగాల వారున్నారట. మహర్షిగారు తమ దగ్గర 6 వేలు వైద్యానికి సంబంధించిన తాళపత్ర గ్రంథములున్నవనియు, వాని పరిశోధనద్వారా యీ ఓషధులను కనుగొన్నానని వెల్లడించారు.

◆ ◆ ◆

ప్రత్యేకంగా గ్రుడ్డివారికుపయోగ పడేందుకు 27 ప్రాంతీయ గ్రంథాలయములను అమెరికాప్రభుత్వము స్థాపించింది. వానిలో అనేకగ్రంథాలను గ్రామఫోను రికార్డులద్వారా వినిపిస్తారట. తడుముకొని చేతివ్రేళ్లతో చదువుకొనే గ్రంథాలుకూడ విశేషముగా నున్నవట.

◆ ◆ ◆

ప్రత్తి, కృత్రిమపట్టులను రసాయనిక పద్ధతులద్వారా కరిగించి ఉన్నివంటి వస్త్రాలను వాషింగ్టన్ నగరంలో తయారు చేస్తున్నారట. ఇవి ఉత్తమంగాను, వెచ్చదనము నీయగలవిగా నున్నవట. వానిని వివిధదేశాలకు త్వరలో ఎగుమతి చేస్తారని తెలుస్తున్నది.

◆ ◆ ◆

ఇండియన్ ప్లానింగు కమీషన్ తయారుచేసిన పంచవర్ష ప్రణాళికకు 1793 కోట్ల రూపాయలు పెట్టుబడి యవసరమట. దానిని అమలుపరచడం వలన 1955 - 56 సంవత్సరాంతానికి దేశం మొత్తముమీద అత్యవసర వస్తువులసప్లయి యుద్ధానికి పూర్వంవలె నుండగలదట. అయిదు సంవత్సరములు నిండుసరికి తృప్తికరమైన అభివృద్ధి సమకూరగలదట.

◆ ◆ ◆

అంబలాపట్టణములో శ్రీ రమేష్‌చంద్ అనేయోగి యోగప్రదర్శనంలో 5 సెకెండ్లపాటు గుండె ఆడకుండా చేశాడట. సమక్షంలోనున్న మెడికల్ ఆఫీసరుపరీక్ష చేసిచూచి ఆవిషయము నచ్చటివారికి తెలియజేశాడట.

---



---



మద్రాసు ప్రభుత్వ విద్యామంత్రి పత్రికా ప్రతినిధుల సమావేశములో నిట్లు చెప్పిరి:

భారత రాజ్యాంగములో సూచించిన ప్రకారము 15 సంవత్సరములలో మేము నిరక్షరాస్యతను నిర్మూలింపదలచాము. అయితే ప్రస్తుతానికి నిర్బంధ ప్రాథమిక విద్యావ్యాప్తిని నిలుపుదలచేసి ప్రాథమిక పాఠశాలలను ప్రాతిపదిక విద్యాకేంద్రాలుగా మార్పు చేయదలచాము.

♦ ♦ ♦

స్పెషలుపోలీసు శాఖాధికారుల సమావేశానికి ఢిల్లీలో ప్రారంభోత్సవము చేయుచు కేంద్రమంత్రి సి. రాజగోపాలాచారిగారిట్లు చెప్పిరి:

గత కొలది సంవత్సరములలో అవినీతి అధికమైనదనే విమర్శ సమంజసమయినది కాదు. ప్రస్తుతం అవినీతిపరులైన అధికారులకన్న నిజాయితీకలిగిన అధికారులసంఖ్య చాలఎక్కువగా నున్నది.

♦ ♦ ♦

స్వామీ సీతారాం ఆంధ్రానందయాత్రా సందర్భమున గుంటూరులో యిట్లు చెప్పిరి:

ఆంధ్రరాష్ట్ర ఉద్యమమును ప్రభుత్వము అపహాసిస్తున్నది. ఈ అవమానాన్ని ఆంధ్రులు సహించలేరు. సకాలంలో ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరుగకపోతే, పరిస్థితులు విషమించి సత్యాగ్రహంలో చివరి ఆయుధమైన ప్రాయోపవేశమును ప్రయోగించబోతున్నాను.

♦ ♦ ♦

పాకిస్థాన్ ప్రధానమంత్రి లియాకతాలీఖాన్‌కు పంపిన ప్రత్యుత్తరములో భారత ప్రధాని యిట్లు తెలియజేసిరి:

పిడికిలిబిగించి ముష్టిప్రదర్శనాలు చేయడంవల్ల, యుద్ధప్రలాపాలవల్ల శాంతిసిద్ధించదు; శాంతి ప్రతిపాదనలు చేయుటకది మార్గము కాదు. కాశ్మీరుమీద దాడిచేయడమంటే భారత భూభాగంమీద దురాక్రమణ జరిపినట్లే. ఇట్టి దురాక్రమణను సర్వశక్తులా మేము ప్రతిఘటించి తీరుతాము.

♦ ♦ ♦

అఖిలభారత కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ కేంద్రసంఘంచేసిన తీర్మానములో నిట్లు కలదు:

ప్రస్తుతం కంట్రోల్సు అమలుజరుపుతున్న పద్ధతి ధనికులకు, దొంగవ్యాపారులకు మాత్రము లాభదాయకంగానుంటున్నది. సామాన్య ప్రజలకు కంట్రోల్సు ఏమీ ప్రయోజనకరంగా లేవు. ప్రజల కుపయోగంలేని కంట్రోల్సును రద్దుచేయాలి.

♦ ♦ ♦

భారత అధ్యక్షుడు డా॥ రాజేంద్రప్రసాద్ పార్లమెంటు చతుర్థ సమావేశమును ప్రారంభించుచు నిట్లుపన్యసించిరి:

ఇండియా పాకిస్థానులమధ్య సహకార సద్భావపూర్వకమైన సంబంధాలను పెంపొందించడమే భారతప్రభుత్వ లక్ష్యము.




సరళాప్రభాకరము: రచయిత కె. చంద్రమతి, 67 కచ్చేరిరోడ్డు, మద్రాసు 4. వెల రు 1-4-0.

ఇది సాంఘికనవల. మొదటినుండిగూడ హిందూసంఘముయొక్క ఉత్కృష్టత, స్త్రీకిగల ఉత్తమస్థానము, ఆదర్శవంతమైన గృహిణికి కావలసిన ఉత్తమగుణములు మొదలగు నంశములు వివరింపబడినవి. హిందూ సాంప్రదాయాలు, ఆచారాల ప్రత్యేకతగూడ పేర్కొన బడినవి.

కాని నారాయణమూర్తిగారి కుటుంబం సర్వతోముఖాభివృద్ధినొందినదని కథనడవటం కొంత అసహజంగా కనుపించుచున్నది. ఎంత సంపన్నులయినా, ఎంత సద్గుణములు కలవారైనా మనుమలు, మనుమరాండ్రుపుట్టి పెద్దవారై, చదువు సంధ్యలు, పెండ్లిళ్లయినదాక ఎట్టి ఒడిదుడుకులు లేకుండా యుండటం సహజత్వాన్ని కోల్పోతున్నది.

ఈ గ్రంథము నందలి వివాహములను రెండు విధములుగా విభజింపవచ్చును. బాల్య వివాహములు, మళ్లీపెళ్లి. ఈ రెంటిని ప్రస్తుతము ప్రజలు ప్రోత్సహించలేరు. బాల్య వివాహముల వలన బాగుపడిన వారున్నారు; చెడిపోయిన వారున్నారు. కాని బాల్య వివాహముల మూలంగా తల్లిదండ్రులు బాధ్యతతో వ్యవహరించకపోతే చెడుట ప్రాప్తిస్తుంది; పైగా వధూవరులు మంచిచెడ్డలను, బాధ్యతను చిన్నతనములో గుర్తించకలిగిన స్థితిలోనుండరు. అందుకనే బాల్య వివాహాలపట్ల యీనాడు ప్రజలు విముఖులైనారు.

ఇక రెండవరకం వివాహం సరళా ప్రభాకరాలది. తండ్రి చనువుకని సరళను మద్రాసులో దిగవిడిచిపోతూ కనిపెట్టి యుండవలసినదిగా డాక్టరు ప్రభాకరరావుకు ఒప్పజెప్పి పోయాడు. ప్రభాకరరావు ఉత్తమగుణ సంపన్నుడుగను, పేరు ప్రఖ్యాతులు కలవాడుగను, పేర్కొనబడెను. అతనికి గుణవతి రూపసియైన భార్య పద్మావతి. ఇద్దరు పిల్లకాయలు. కుటుంబభారాన్ని బాధ్యతతో నిర్వహిస్తున్నవాడు. ఎన్ని సంబంధాలు వచ్చినా నిరాకరించి సరళ డాక్టరు ప్రభాకరరావును ప్రేమించింది. ఇది ఎంతవరకు ఉచితమయిందో ఆలోచించవలసిన విషయం. సరళ ప్రేమించినాతన్ను, తన సంసారమును, ముఖ్యంగా ఏలోటు, వంకలేనిభార్యను విస్మరించి బాధ్యతారహితంగా సరళను వివాహమాడటానికి నిశ్చయించాడనడం డాక్టరుకు కళంకం ఆపాదించడమే.

పద్మావతి పతివ్రతగా చిత్రించబడింది. కాని భర్త సుఖాన్ని ఆశించి త్యాగాలు చేయవచ్చును. కాని, తనలో వడివంక లేకపోయినా, ఇద్దరు ముగ్గురు పిల్లకాయలు పుట్టినతరువాత మరొకవనితను తనభర్త వివాహమాడుట సహించియుంటుందా అనేదిసంశయం. భర్తతోపాటు భార్య కష్టసుఖాలలో పాల్గొంటూ, బాధ్యతను పంచుకొని తనకుటుంబక్షేమాన్ని అపేక్షించేది పతివ్రత. అవసరమయితే తప్పుదార్లలో నడిచేటప్పుడు భర్తను మంచిమార్గంలో నడుపడంగూడ పతివ్రతాలక్షణం. ఈ వివాహానికి తల్లి, భార్య సమ్మతించారన్నా, డాక్టరు తనబాధ్యతను విస్మరించడం పొరబాటు. ఇట్టి వివాహాలను హిందూసంఘం ప్రోత్సహిస్తే తన విశిష్టతను కోల్పోతుంది.

ఇందలి భాష సరళముగానుండి పిన్నలకు పెద్దలకుకూడ నందుబాటులో నున్నది.

**రోజా: రచయిత శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు, 14 స్ట్రాట్స్ స్ట్రీటు, మైలాపూరు, మద్రాసు 4. వెల రు 1-0-0.**

ఈ చిన్నకథల సంపుటి, ఇందలి కథలు యిదివరలో భారతి, ఢంకా, ఆంధ్రపత్రిక మొదలగు వానిలో ప్రచురితమయినవి. గ్రంథకర్త పండితుడు; ప్రత్యేక వ్యక్తిత్వముగల ఉత్తమ శ్రేణికి చెందిన కథకులలో నొకరు. వీరు కథారచయితలే గాక మాండలిక పదాలను, లోకోక్తులను, జానపద గీతాలను స్వీకరించుట ద్వారాను, వ్యవహారిక భాషకు కొన్ని నియమములను సృష్టిచేయ ప్రయత్నించుట ద్వారాను, గేయ రచయితలుగాను ఎంతో కాలము నుండి ఆంధ్రభాషకు సేవచేయుచుండుట ప్రశంసనీయము.

ఇందలి కథలలో ప్రతియొక్కటి ఏదో ఒక ఉత్తమ ఆదర్శంతో వ్రాయబడింది. వీని నడక రస వంతంగాను, హృద్యంగానుండి పలువురు పండిత పామరుల మన్ననల పొందినవి. ఇది ఆంధ్ర భాషలో వెలువడిన ఉత్తమ కథాసంపుటములలో నొకటిగా చెప్పవచ్చును.

**సహకారరాజ్యం (బుర్రకథ); రచయిత శ్రీ వారణాసి వెంకట నారాయణశాస్త్రి గారు ప్రకాశకులు- జనపద ప్రచురణలు, నారాయణగూడ, హైదరాబాదు.**

ముఖ్యంగా మన ఆర్థికాభివృద్ధికి సహకార ఉద్యమం ఎంతో ఉపకరిస్తుంది. కాని స్వార్థము సన్నగిలి ప్రజాశ్రేయస్సును, దేశాభివృద్ధిని దృష్టిలో నుంచుకొని ప్రజలు విశాలదృష్టితో వ్యవహరించిననాడే సహకార ఉద్యమమైనా సత్ఫలితాలను ప్రసాదిస్తుంది.

బుర్రకథలు యీనాటివి కావు. చాల కాలమునుండి బాలనాగమ్మ, లక్ష్మమ్మ మొదలగు చరిత్రాత్మక పురాణకథలు బుర్రకథల రూపంలో వాడుకలో నున్నవి. ఈమధ్య రాజకీయ ప్రచారానికి, పురుషుల జీవిత చరిత్రలను స్మరించడానికి, బుర్రకథలు వినియోగానికి వచ్చినవి. ఈ పరిస్థితులలో సహకార రాజ్యమును ఉత్తమ ఉద్యమమువంటి సహకారము వ్యాప్తి నుద్దేశించినందులకు గ్రంథకర్త ప్రశంసా పాత్రుడు.

వ్యవసాయము, పరిశ్రమలు మొదలగు వానిని సహకార పద్ధతుల ననుసరించి నడుపుట వలన ప్రస్తుతపు ఆర్థిక దుస్థితి తొలగుటయే కాక దేశం సర్వతో ముఖాభివృద్ధి నొందుటకు నేక అవకాశము లున్నవి.

ఈచిన్న పుస్తకములో సహకారమువలని సత్ఫలితాలు పేర్కొనబడినవి, సహకార ఉద్యమ విస్తరణకు యిది చాల తోడ్పడలగదని నమ్ముచున్నాము.

**శ్రీకుసుమ హరనాథలీలా సంగ్రహము: గ్రంథకర్త, ప్రచురణకర్త శ్రీ కొత్తపల్లి బుచ్చయ్యశర్మ, పాలమూరు, పశ్చిమ గోదావరిజిల్లా, వెల రు. 1-0-0**

భారతదేశం అనేకమంది పుణ్యపురుషులు పుట్టి వర్ధిల్లినభూమి. వారిప్రభావం మానసిక, ఆధ్యాత్మిక పరివర్తనానికి ప్రజలకు ఎంతో ఉపకరించినది. అట్టివారిలో కుసుమహరనాథులు ఎన్నతగినవారు.

వారి జీవితాదర్శాలను, బోధనలను అర్థముచేసుకొని విశాలదృష్టిలో ఉత్తములుగా వ్యవహరించుట కీగ్రంథ ముపకరించగలదు.

రాజమహేంద్రవరమునందలి శ్రీ హితకారిణి సమాజముయొక్క 1948-'49-50' వార్షిక నివేదికలు మా కార్యాలయము చేరినవి.

ఈ నివేదికలనుబట్టి సమాజముయొక్క అభివృద్ధి, పరిపాలనా పటిష్టత గమనించనగును. పలువురు దాతలు భూరివిరాళములనిచ్చి హితకారిణి సమాజము, వీరేశలింగ ఆస్తిపున్నత పాఠశాల, ప్రార్థన సమాజముల అభివృద్ధికి తోడ్పడుచుండుట ప్రశంసనీయము.

ఈ సమాజము ధర్మ సంస్థగానుండి సర్వవిధముల ప్రజాజీవితమును వికాశవంతముగా చేయుట లక్ష్యము. ఇట్టి ఉత్తమ లక్ష్యములకొరకు కృషిచేయుచున్న సమాజమును విరివిగా విరాళములిచ్చి పోషించుకొనవలసిన భాధ్యత శ్రీమంతులది.

—(o)—

# పత్రికా స్వీకారము

"గీతావాణి" మాసపత్రికను శ్రీ గీతాప్రచుర సమితి, ఆళ్ళగడ్డ (కర్నూలుజిల్లా) వారు శ్రీ మద్భగవద్గీతా తత్వసందేశమును వ్యాప్తి చేయగలందులకు ప్రచురణను ప్రారంభించారు. ప్రథమసంచిక మా కార్యాలయము చేరినది.

సమితివారి ఉద్దేశములు, ఆశయములు ఉన్నతమయినవి. ప్రస్తుతపు కల్లోలిత ప్రపంచానికి గీతా సందేశము ఎంతైనా అవసరము. ప్రథమ సంచికలో ఉత్తమమైన వ్యాసము లనేకములున్నవి. సమితివారి కృషి ప్రశంసాపాత్రమైనది.

సంపాదకుడు : శ్రీ యన్. శ్రీ కంఠం, సంవత్సర చందా రు 4 0.0. విడి పత్రిక ఆరు అణాలు.

# సంపాదకీయములు

## చరిత్రలో సువర్ణాక్షరాలు!

మహాత్యాగి, జాతీయవీరుడు, స్వార్థరహితుడు, యథార్థమైన గాంధీవాది, భారతజాతికి హృదయము వంటివాడు, స్వాతంత్ర్యము తెచ్చిన మహానాయకుల శ్రేణికి చెందినవాడు.

ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంపంతులుగారి త్యాగము జగద్విదితం. షుమారు నెలకు 10 వేల రూపాయల నార్జించే బారిష్టరు పదవిని కాలదన్ని స్వాతంత్ర్య సమరంలోకి దూకి సర్వము దేశకళ్యాణము కొరకు త్యాగముచేసిన మహనీయుడు. ఈనాడు ఆయనకు ఆస్తిపాస్తులులేవు. దుర్భరదారిద్ర్యము ననుభవిస్తున్న ప్రజానీకంతోబాటు వారి కష్టసుఖాలను తనవిగాభావించి వారిశ్రేయస్సును, అభివృద్ధిని లక్ష్యంగా నుంచుకొని పాటుపడుతున్న నిరాడంబరజీవి.

సైమనుకమీషను బహిష్కారంలో చెన్నసగరవీధుల్లో తుపాకిదెబ్బకు గుండె నెదురిచ్చినధీరుడు కాబట్టే "ఆంధ్రకేసరి" అయినాడు.

పంతులుగారు ఏపదవి నిర్వహించినా ఎన్నడు స్వార్థమును దృష్టిలో నుంచుకొనిన వాడుకాడు. తనకార్యక్రమాన్ని ప్రజాశ్రేయస్సును, అభ్యుదయాన్ని ఉద్దేశించి నిర్వహించినవాడు. వారికి ప్రజాసేవయే లక్ష్యం.

శ్రీ ప్రకాశంగారు పరిపాలనాదక్షుడు కాదనడం అసమంజసం. పరిపాలనాదక్షతను రెవిన్యూ మంత్రిగాను, ప్రధానమంత్రిగాను విప్లవాత్మకమైన మార్గంలో సామాన్య ప్రజానీకాన్ని, వారికష్టాలను దృష్టిలోనుంచుకొని నడిపాడు. వారి అచంచలమైన ఆత్మవిశ్వాసము ఎల్లప్పుడు ప్రభుత్వ నిర్వహణ ముందుకే నడుపుతుంటుంది. వారి పరిపాలనే యీనాటివరకున్నట్లయితే యిప్పటి ఆర్థికదుస్థితి యింతవిషమంగా నుండేదికాదు.

ప్రజానీకం శ్రీ ప్రకాశంగారి దేశసేవాపరాయణత్వము, కార్యదీక్ష, సమర్థతలను గుర్తించింది. కాబట్టే వారికిబ్రహ్మరథం పడుతున్నారు. వారిమీటింగులకు తండోపతండాలుగా వచ్చి ఉత్సాహంతో పాల్గొంటారు. ఆయనను ప్రజలు తమనాయకుడుగాను, జాతీయవీరుడుగాను పూజిస్తున్నది; అనుసరిస్తున్నది.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణంకొరకు వారుచేసినకృషి ప్రజలుఎన్నడు మరువరానిది.

ఆర్థికంగా పంతులుగారు పేదవారైనా ప్రజల ఆదరాభిమానాలు, ప్రేమ వారికి ధనధాన్యాలకు మించినవి. ప్రజల కష్టసుఖాలే వారికష్టసుఖాలు. వారిజీవితం ప్రజాజీవితంతోను, హృదయంతోను పొత్తుకపోయింది. అందుకు చిహ్నంగానే బెజవాడలో కంచువిగ్రహ అవిష్కరణ మహోత్సవము డాక్టరు ప్రఫుల్ల చంద్రఘోష్‌గారి అధ్యక్షతన కేంద్ర తంతితపాలా రహదారిమంత్రిగానుండిన రఫీఅహమద్ కిద్వాయిగారిచే అత్యంతవైభవముగా వేలాదిప్రజల ఆనందోత్సాహాలమధ్య జరిగింది. ఇది ఆంధ్రప్రజానీకానికే కాక యావద్భారతానికి పదవకాశము.

---

# శ్రీ ఖరనామ సం॥ర శ్రావణ భాద్రపద మాసములు.

ఆగష్టు నెల 1951 సం॥

| | | |
|---|---|---|
| 16 | గు | చతు 12-22 శ్ర 38-55 రా 17-14 ఋగ్వేదనాముపాకర్మ. |
| 17 | శు | ○ పూ. 6-46 ధ 26-0 రా 21-57 హరిపదపుణ్యకాలం. |
| 18 | శ | బ. పాడ్యమి 2-0. పూభా రా 18-5 చాతుర్మాస్య శ్రీవెంకటేశ్వరవ్రతం. |
| 19 | ఆ | త. 55-54 ఉభా 32-38. రా 25-17. |
| 20 | సో | చ 54-40 ఉభా 32-38. శివనక్తవ్రతం, సంకష్టహర చతుర్థీవ్రతం. |
| 21 | మం | పం 54-44 రే 33-55 దివ 7-16 మంగళగౌరీవ్రతం. |
| 22 | బు | ష 55-47 అశ్వ 36-19 దివ 25-55 కన్యాయనం, మృత్యుయోగం. |
| 23 | గు | స 58-4 భర 39-47 ది 1-43. శీతలావ్రతం. |
| 24 | శు | అ 60-10. కృ 44-16 ది 12-2 సర్వేషాం శ్రీకృష్ణజయంతి, దశఫలవ్రతం. |
| 25 | శ | అ 1-1 రో 49-28 ది 27-44 శ్రీ వెంకటేశ్వరవ్రతం. |
| 26 | ఆ | న 4-57 మృ 55-28 ది 4-47. |
| 27 | సో | ద 9-12. ఆర్ద్రా 60-10. ది 18-14 శివనక్తవ్రతం. |
| 28 | మం | ఏ 17-45 రా 32 రా 7-28 మొ 9-14 ఘ. మంగళగౌరీవ్రతం. |
| 29 | బు | ద్వా 18-11 పున 6-8. ది 29-1 త్రయోదశితిథిః. |
| 30 | గు | త్ర 22-14 పుష్య 12-46 రా 16-24 శూన్యతిథిః, మాసశివరాత్రి. |
| 31 | శు | చతు 25-40 ఆశ్రే 17-47 రా 18-55 చతుర్దశితిథిః. |
| 1 | శ | ● అమా 28-17 మఘ 22-0 రా 12-11 శ్రీ వెంకటేశ్వరవ్రతం. |
| | | **భాద్రపద మాసము** |
| 2 | ఆ | శుద్ధపాడ్యమి 29-47 పూఫ 25-21 రా 17-3. చంద్రోదయం. |
| 3 | సో | ది 30-1 ఉఫ 27-22 రా 17-48 |
| 4 | మం | త 27-44 హ 28-17 రా 17-19 బలరామజయంతి. |
| 5 | బు | చ 22.14 చి 28-1 రా 10-50 చతుర్థితిథిః వినాయకచతుర్థి. |
| 6 | గు | పం 22-58 స్వా 26. పంచమితిథిః, ఋషిపంచమివ్రతం. |
| 7 | శు | ష 19-42 విశా 24.2 రా 2-59 తిథిద్వయం. |
| 8 | శ | స 14-21 అనూ 20-42 రా 3-6 అష్టమితిథిః. |
| 9 | ఆ | అరా. 32 జ్యే 16-40. రా 4.32 శుక్రమౌఢ్యమినివృత్తి. |
| 10 | సో | న 2-16 విష్క 57-29 మూ 12-14 ది 8-32 గజలక్ష్మీవ్రతం. |
| 11 | మం | ఏ 49-19 పూషా 7-35 సర్వేషాంపరివర్తనైకాదశీ. |
| 12 | బు | ద్వా 47-32 ఉషా. 3-31 ది 12-24 వామనజయంతి. |
| 13 | గు | త్ర 37-43 ధ 55-48. ది 8.36. అనంతవ్రతం. |
| 14 | శు | చతు 33-4. శత 57-19. ది 13-8. అనంతవ్రతం. |
| 15 | శ | ○ పూ 29-20 పూభా 51-55 ది 8-55 సావిత్రివ్రతం. |

సెప్టెంబరు నెల

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

